సాహిత్య
ప్రస్థానం
అక్టోబర్ 2011
సంపుటి : 11 సంచిక : 69

# అనిశ్చితి, అధోగతి

అవకాశవాద రాజకీయాల కారణంగా ఆంధ్ర ప్రదేశ్ రాజకీయ కాష్టమై మండుతున్నది. అంతుపట్టని అనిశ్చితి పట్టి పీడిస్తున్నది. ప్రాంతాల మధ్య ప్రజ్వలనాలను ఎగదోసిన పాలక వర్గ పార్టీల పథకాలు పన్నాగాలకు అన్ని ప్రాంతాల ప్రజలూ బలవుతున్నారు. ఉద్దేశపూర్వకంగా రాష్ట్రంలో రాజకీయ ప్రతిష్టంభన సృష్టించిన కేంద్ర ప్రభుత్వం భవిష్యత్తుకు సంబంధించి ఏ మాట చెప్పకుండా చెలగాటమాడుతున్నది. తెలంగాణా విభజన కావాలనే వారు, సమైక్యంగా వుండాలనే వారు కూడా ప్రధాన పార్టీలకు చెందిన వారే కావడం గమనించదగ్గది. అలాగే ఒక ప్రాంతానికే పరిమితమైన పార్టీలు కూడా వ్యూహాత్మక గజిబిజిలో ఉద్రేకాలు పెరగడానికే కారణమవుతున్నాయి. ఏతావాతా ఎడతెగని అనిశ్చితి తిష్ట వేసి కూచుంది. ఈ నెలలో తెలంగాణా ప్రాంతంలో సకల జనుల సమ్మె తర్వాత ప్రజల జీవన స్థితిగతులు అస్తవ్యస్తంగా తయారైనా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు చొరవ తీసుకుని పరిష్కారానికి కదలిక చూపకపోవడం అందరి విమర్శకు గురైంది. సమస్య పరిశీలనకు నియమించిన శ్రీకృష్ణ కమిటీ నివేదిక నిచ్చి ఎనిమిది మాసాలు గడిచినా కేంద్రం తన వైఖరి చెప్పడం లేదు. రాష్ట్రంలోని రాజకీయ పార్టీలదే బాధ్యత అని చేతులు దులుపుకుంటున్నది. రాష్ట్రం నిమిత్తమాత్రంగా వ్యవహరిస్తూనే నిర్బంధం ఆరోపణలను ఎదుర్కొంటున్నది. మొత్తంపైన సామాన్యుల జీవితాలు ఛిన్నాభిన్నమై పోతున్నాయి. మధ్యతరగతి మనుషుల ఉద్వేగాలు మిన్నంటుతున్నాయి. ఈ అనిశ్చితి, అధోగతి రాష్ట్రానికి ప్రజలకు ఏ మాత్రం శ్రేయస్కరం కాదు. వెంటనే ఒక విధాన నిర్ణయం ప్రకటించి సాధారణ పరిస్థితులను పునరుద్ధరించవలసిన బాధ్యత కేంద్రంపైనే వుంది. ఈ విషయంలో ఒకోరోజు జాప్యం ఉద్రిక్తతకు ఆజ్యం పోస్తుంది.

...........

చిన్నప్ప భారతి అవార్డుకు ఎంపికైన అద్దేపల్లి రామమోహన రావుకు అభినందనలు. రచనలు ప్రసంగాలతో పాటు సాహితీ స్రవంతికి నిరంతరం తోడుగా నిల్చిన అద్దేపల్లి ఎంపిక పట్ల పలువురు సంతోషం వ్యక్తం చేస్తూ సందేశాలు పంపించారు. వారికీ ఈ అవార్డు ఏర్పాటు చేసి ఎంపిక బాధ్యత మాకు అప్పగించిన చిన్నప్ప భారతికి కృతజ్ఞతలు.

............

తెలంగాణా తొలితరం కథకుడు గూడూరి సీతారాంకు జోహార్లు అర్పిస్తున్నాము. సీనియర్ రచయితగా వున్నా వివాద రహితుడైన సహృదయుడుగా సీతారాం స్రవంతికి శ్రేయోభిలాషిగా వున్నారు. సాహిత్య రంగంలో స్తబ్దతను పటాపంచలు చేసిన సాహిత్యశాలలకు పలు చోట్ల ఆయన హాజరై ఉత్సాహ పరిచారు, తనూ ఉత్సాహం పొందారు. మూర్తీభవించిన పెద్దరికం, సాహితీ స్ఫూర్తి ప్రతిబింబించిన సీతారం మృతి అక్షర లోకానికి లోటు.

బొమ్మలు : చంద్ర, శివాజి, వెంకటేష్

## ఈ సంచికలో...

చిగురించిన వాత్సల్యం (కథ)...................... 2
కవిత ........................................ 6
అద్దేపల్లికి చిన్నప్పభారతి పురస్కారం ............ 7
మనిషి మనుగడకు అత్యవసరం
చీకట్లు ఛేదించే సాహిత్యం ............... 8
మోటార్ సైకిల్ డైరీ 'జర్నీ విత్ ఐరన్ హార్స్'..... 13
కవిత ........................................ 20
నివాళి (కథ)........................................ 21
కవిత ........................................ 23
సాల్వెటోరీ క్వాసిమోడో (సౌభాగ్య) .............. 24
కవిత ........................................ 26
జీవితం (కథ)........................................ 27
పొన్నుస్వామితో ఇంటర్వ్యూ........................ 28
కవిత ........................................ 29
బొమ్మ (అనువాద కథ) ............................ 30
కవిత ........................................ 33
సంపూర్ణ సంపాదకుడు........................... 34
స్ఫూర్తి నింపిన తమిళ అభ్యుదయ రచయితలు,
కళాకారుల మహాసభలు ......................... 36
ఆకర్షణీయ కథనం
వీరాజీ - విడీవిడని చిక్కులు (నచ్చిన రచన). 38
కొత్త పుస్తకాలు.................................. 40
ప్రస్థానం ప్రత్యేక సంచికకు అభినందన ......... 42
డైరీ ........................................ 44



చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in
ssprasthanam@gmail.com
www.prasthanam.com

కథ

# చిగురించిన వాత్సల్యం



"కొండా! కొండా, పాల తపేలా ఒట్టుకు రా అంటూ పసువులసాల నుండే కేక పెట్టాడు పెంటం నాయుడు. మంటి పొయ్యని పేడ పెట్టి అలుకుతున్న అంకమ్మ "నాయినా అమ్మి నిన్ననే దాని అత్తవారింటికి ఎల్లిపోనాది రా" అని సమాధానం చెప్పి - "బాప్పా! బాప్పా పెంటడికి తపెలా ఇస్సి" అంటూ కేక పెట్టింది. గుమ్మం దగ్గర కూర్చొని చుట్ట కాల్చుకుంటున్న పర్సినాయుడి తల్లి లేచి గిన్ని పట్టుకు బయలుదేరింది.

- ఇనుగంటి జానకి

పర్సినాయుడు ఇంటి పెరటి వాకలిలో నులక మంచంపై బొంత పర్చుకొని తల క్రింద తలగడా పెట్టుకొని పడుకొని ఉన్నాడు. అంకమ్మ భర్త దగ్గరగా వచ్చి "నెగు ఇంకా నెగవా! అమ్మి ఎల్లిపోనాది, ఇంతవరకు ఉండి మనకి సల్లనా పుల్లనా సేసి ఎట్టింది, ఇక మనం గుండె నిబ్బరపర్చుకోవాల. మన పనులు మనము సేసుకోవాల. ఆడిని తొమ్మిది మాసాలు మోసి కనినాను, గాలో ధూలో ఆకలో దప్పికో అన్ని సూసుకొని పెంచినాను నాను ఏడ్చుకొని కూకోవల్సింది. నానే నెగిసి పెద్దా సిన్న పని సేస్తున్నాను నీవు ఇలా ఉండిపోతె ఎలా?" అంటూ రకరకాలుగా బోధపర్చె ప్రయత్నం చేస్తున్నాది. ఇంతలో పాలగిన్ని పెంటం నాయుడికి ఇచ్చి తిరిగి వచ్చిన పర్సినాయుడి తల్లి – "నాయినా నెగు పలకర్రా సేసుకొని సల్ది తిను, సూడు ఎలా ఉన్న వాడివి ఎలా అయిపోయినావో నెగు – నెగు" అంటూ బతిమాలింది. సాల నుండి గేది పాలు పితికి తెచ్చిన పెంటం నాయుడు – "వదినా – ఇవుగో పాలు బేగి ఎల్లు కేనోడు ఎల్లిపోతాడు" అంటూ పాల గిన్ని అంకమ్మకి అందించాడు. గిన్ని అందుకొని అంకమ్మ బయలుదేరింది. పెంటంనాయుడు పర్సినాయుడి మంచం దగ్గరగా వచ్చి – "ఇంకా ఎన్నాలు ఏడ్చుకోని తొంగోని ఉండిపోతావురా అన్నా! ఏటి ఈ వాలకం. నాను నీ గేదెలు ఇక మేతకు తోలుకుపోనేను, సేతకాకపోతే గేదెలు శనారం సంతకు తోలుకుపోయి అమ్ముకో, ఆడుపోయి మూడుమాసాలు అవుతాది ఇంక ఎన్నాలు ఆల పని సేసుకుకూంటాము అంటూ నీ మరదలు గొడవ ఎడుతోంది" అని స్పష్టంగా చెప్పి వెళ్ళిపోయాడు. పెంటంనాయుడుని వెళ్ళనిచ్చి "ఏటేటి అమ్ముకోవాలా? మా నాయినే ఎంత సునాయాసంగా సెప్పినావురా" అంటూ ఏవేవో గొణగడం ప్రారంభించింది ముసిలిది. ఆ మాటలు వినలేక మంచం నుండి లేచి పెరటిలోకి వెళ్ళి వచ్చి నోటిలో పుడక పెట్టుకొని ఆలోచిస్తూ కూర్చున్నాడు పర్సినాయుడు. సీ పాడు బతుకు, మారాజు లాంటి నా కొడుకు పోయినాడు. పాంటు సొక్కా ఏసుకోని మోటారు సైకిలుపై నా కొడుకు మేట్టరు ఉద్యోగానికి ఎల్లుతూ ఉంటే సూసి మురిసి పోయేఒడిని. ఆడి మావ కట్నం కింద రొండు గొడు గేదలు ఇత్తాను అంటే, ఆడు గేదెలు వద్దు నాను ఇసుకూలుకు ఎల్లేందుకు మోటారు సైకిలు కావాలా అని కోరినాడు. నానుకాదు అని సెపితే ఆడి మనసు సిన్నపోతాది అని వల్లక ఉండి పోయినాను ఆ మోటారు సైకిలే ఆడిని మోసుకుపోయినాది అని బాధపడుతూ కూర్చున్నాడు.

పాలు కేను పైడయ్య అంకమ్మని చూసి – "ఎన్నాలకి వస్సినావు తల్లి. ఆ దేవుడికి నాయం నేదు. మంచివాలకే పరిచ్చ ఎడతాడు" అంటూ విచారించి "మీ అమ్మి ఎల్లిపోయినాదిట" అని అడిగాడు. "ఎల్లిపోయినాది, నిరుడు కరువుకు ఆలూర్లో కూలీలు వలస ఎల్లిపోయినారుట. వరిపొలంలో కలుపు తీసే వారు దొరకడం నేదు అని అల్లుడూ ఫోను సేసినాడు. అది దాని అమ్మిని ఉపమా బడిలో ఏసిన నెలనాడే చిన్నవునాయుడు పోయిన కబురు విని ఏడ్చుకు వస్సినాది. నాను ఇంకా ఇక్కడే ఉండిపోతే నీ మనవరాలికీ బడికిపోయే అలవాటు తప్పిపోతాది అని సెప్పి ఎల్లిపోయినాది. నాయినా ఓ అయ్య సేతిలో ఎట్టాక అది ఇట్టం ప్రకారం తిరగాల. ఎన్నాలు మాకోసం మొగుడూ మొద్దులు లేక

కూకొని ఉండిపోతాది" అని చెప్పింది. "మీ అమ్మికీ పాలు - గుడ్లు అమ్మిన డబ్బులు ఇస్సినాను అందినాయా?" అని అడిగాడు పైడయ్య.

"అందినాయి" అని సమాధానం చెప్పింది అంకమ్మ.

"చిన్నవునాయుడిని మట్టించిన నారి వాడు ఏటైనా డబ్బు ఇస్సినాడా?" అని అడిగాడు పైడయ్య. "కొండంత కొడుకు పోయినాక డబ్బేటి? ఆడత్తారు కేసు ఏసినారుట, ఆ నారి ఓనరు ఎంతో కొంత ఒట్టుకుపోండి కేసు వద్దు అని బతిమాలినా, అలు ఇనుకోనేదు" అని చెప్పి ఖాళీ గిన్ని పట్టుకొని ఇంటికి తిరిగి వచ్చేసింది.

ఉత్తరాంధ్రలోని ఓ పల్లెటూరిలో నివసిస్తున్నాడు పర్సినాయుడు కుటుంబంతో. పర్సినాయుడికి అరవై ఐదు సంవత్సరాలు ఉంటాయి. తలపై జుత్తు మీసం కట్టు తెల్లబడిపోయినప్పటికి కోరమీసాలు ఉంచుకొనేవాడు. రాగి రంగు శరీరం ఆరడుగుల మనిషి బందోబస్తుగ ఉంటాడు. తెల్ల గ్లాస్కో పంచ కల్లి లాల్చీ వేసుకునేవాడు. సమయస్ఫూర్తి మాటకారి స్వభావం. అందరితో గలగలా మాటలాడుతూ నవ్వుతూ నవ్విస్తా ఉండేవాడు. కష్టపడి పేదరికం నెట్టి ఆస్తి సంపాదించుకున్నాడు. ఇక తనకి సుఖపడిన రోజులు వచ్చాయి అనుకున్నప్పుడు తన కొడుకు బైక్ ఏక్సిడెంట్‌లో పోయాడు.



అంకమ్మకి యాభై అయిదు సంవత్సరాలు ఉంటాయి. నల్లగా, సన్నంగా మామూలుగానే ఉంటుంది. తలపై జుత్తు ఇప్పటికీ నల్లగానే ఉన్నాది. పొడవుగా వంటిజడ అల్లుకుంటుంది. మునుపు అరవయ్యో నెంబరు బొబ్బిలి నేత చీర కట్టుకునేది, ఇప్పుడు మిల్లు నేత జరీ చీరలు కట్టుకుంటుంది. విజయనగరం వెళ్ళి తన కోసం బట్టలు కొనేటప్పుడు విధిగా భార్య కోసం కూడా చీరలు కొని తెచ్చేవాడు పర్సినాయుడు.

పర్సినాయుడికి అంకమ్మకి పెళ్ళయిన కొత్తలో ఊరు వాళ్ళు అంకమ్మ ఎదుటే తనకి పర్సినాయుడికి తగిన అందం లేదు అని అన్నప్పుడు బాధపడేది అంకమ్మ. ఓ రోజు పొలంలో ఆడవాళ్ళు వరి కట్టలు విడదీసి ఊడుస్తున్నారు. దగ్గరే మరో మడిలో నోల్ల తోలుతున్నాడు పర్సినాయుడు. వాళ్ళకోసం అంకమ్మ చలెన్నం పట్టుకుని పొలానికి వచ్చింది.

"నోమినోమంన్నానాలో సందామామా, నోమ్మనన్నాలో సందామామా
పిలకొట్టుకు పీకినారు అన్నలు, నడుఒట్టుకు ఒంచినారు అమ్మలు,
రారమ్మా తల్లి ఏరుతందాము రారమ్మా రావే సందామామా... " అంటూ

పాట పాడుకుంటున్నారు ఆడవాళ్ళు. వారిని చూస్తూ గట్టుపై కూర్చున్నాది అంకమ్మ. ఎడ్లు నొల్ల పొలంలోనే విడిచి మెల్లగా అంకమ్మ దగ్గరగా వచ్చి పర్సినాయుడు "సందామామా" అంటూ అరచి పాడాడు. అంకమ్మ బెదిరిపోయింది. అది చూసిన ఆడవాళ్ళు గొల్లున నవ్వారు. పర్సినాయుడు నవ్వుతూ మడిలోకి దిగి ఎడ్లని మళ్ళీ తోలాడు. అప్పుడు వరిమొక్క ఊడుస్తున్న ఒకావిడ దగ్గరే ఉన్న ముసలిదానితో "నానమ్మా మన కులంలో అసలు లేబరాల్లలో పర్సినాయుడు వంటి బందోబస్తు సరీరం ఇటువంటి సరీరసాయ ఉన్నవాడిని నాను సూడనేదు" అని అడిగింది. "ఎండకి ఎండి వానకి తడిసినోల్లమి మనలో ఇలాటాడు ఎక్కడ? నీకో ఇసయం సెపుతాను ఇను. ఈ ఊరి సివరనా బంగలా ఉంది సూసినివా, ఇప్పుడు పాడుబడి పోయి బంగలాలో మర్రిసెట్టు ఊడలు అల్లుకుపోయినాయి? దొరలు ఉన్న రోజులలో బంగలాకి అప్పుడప్పుడూ దొరలు వస్సిపోయేవారు. దొరలు వస్సినప్పుడు పర్సినాయుడి తాతమ్మా ఇల్లు కసాలా ఊడవటానికి, గిన్నెలు దోమడానికి బంగలాలోకి ఎల్లేది. పర్సినాయుడి తాత పుట్టినప్పుడు ఊరిలో అంతా గుసగుసలాడుకున్నారు. నాను అప్పుడు సిన్నపిల్లనినే, పర్సినాయుడిది అచ్చం తాత పోలికే?" అంటూ చేతులు తిప్పుతూ చెప్పింది ముసలిది. ఆ మాటలు విన్న ఆడవాళ్ళు పగలబడి నవ్వుకున్నారు. వాళ్ళాడుకున్న మాటలు విన్న అంకమ్మ బాధపడుతూ పర్సినాయుడి వేపు చూసింది. పర్సినాయుడు మడి చివరిలో దూరంగా బురదలో కూరుకుపోతూ ముందుకు సాగేందుకు మొండికేస్తున్న ఎద్దుని బలంగా కర్రతో బాదుతున్నాడు. తను ఆడవాళ్ళు అనుకున్న మాటలు వినలేదు. అంకమ్మ ఇంటికి వచ్చాక తన అత్తతో చెప్పి బాధపడింది. పర్సినాయుడి తల్లి - అమ్మా ఎపుడో ఏదో జరిగినాది ఆడికి తాత పోలికైతే ఆడి తప్పేటి? ఆడు సాలా మంచోడు, తెలివిగలోడు, ఆడు కర్రొట్టుకున్న నాటి నుండి మా ఇంటి దసి తిరిగింది. ఆడికి గానం వస్సినాకా ఆడు తెలుసుకున్నది ఏటంటే కాయ కట్టంపై ఆధారపడినోడి జీవితం మెరుగుపడటం కట్టం అని, అందుకు ఆడు ఈ ఊరిలో ఇంకా సుట్టుపక్కల కాసిన సెనగ పంట కొని మారు వర్తకం సేసేవాడు. పొరుగు ఊరిలో సరకారొలు నైట్ ఇసుకూల్ ఎట్టినప్పుడు పొగలంతా సాకిరి సేసినా రాతిరి ఇసుకూలుకు పోయి అచ్చరాలు నేర్సినాడు. సాటోలు ఎగతాలి సేసినా పట్టించుకునేవాడుకాదు. ఊరు బైట సివారనా కొండ కింద సరకారు పేదలకు భూమి ఇత్తాము అనినపుడు, ఊరి రైతులు అంత దూరాన ఎల్లబొయేటప్పటికే కాలు సేతులు పీకిపోతాయా ఇక వ్యవసాయం పని ఏటి సెయ్యాలా అని వల్లక ఉండిపోయినారు. అప్పుడు పర్సినాయుడు ముందడుగు ఏసి భూమి పట్టా పుస్సుకొని డొంకా తుప్పా పీకి మామిడితోట ఏసినాడు. ఆడిని సూసి మరికొందరు తోట ఏసినారు. మొక్కలకు సత్తుసారం సేసి సెట్టు పూసినప్పటి నుండి కాపలా ఉండి మంచి పంట సంపాదింసినాడు. ఊరిలో మామిడి పంట దండిగా ఉన్న కారణంగా ఇజయనగరం - ఇసాకాపట్టనం సావుకారులు ధర పడనివ్వనేదు. అప్పుడు నలుగురు రైతులని వెంట పెట్టుకుపోయి రాయపూరు కలకత్తా బజారుకి ఎల్లి సేటులతో బేరం కుదురుసుకు వస్సినాడు. నీ అద్రుట్టం నీవు ఆడిని పెల్లాడినావు" అని బోధపరిచింది. జీవిత ఒడిదుడుకులతో పర్సినాయుడు వైఖరిలో, అత్త చెప్పిన మాటలలో ఎన్నడూ తేడా రాలేదు కనుక అంకమ్మకి భర్త పట్ల గౌరవం రోజు రోజుకూ పెరుగుతూనే ఉన్నాది.

పాలు కేనుకు పాలు ఇచ్చి అంకమ్మ వచ్చింది. పర్సినాయుడు మట్టు సిల్వర్‌గిన్నెలో ఉన్న చల్ది అన్నం పిడచగట్టుకొని ఏదో ఆలోచనలో ఉన్నట్లు కూర్చుని ఉన్నాడు. ముసిలమ్మ "నాయినా కల్లుకాలు పోయి గూని ఈడుస్తూ ముసిలిముండను ఉండిపోయినాను. ఆడికి ఎక్కడ వస్సినాదో సావు అంటూ ఏడుస్తున్నాది. అంకమ్మ ముసలిదాని దగ్గరకు

వచ్చి చేతులు పట్టుకొని మెల్లగా లేవదీసి సాల దగ్గరగా తీసుకుపోయి "బాప్పా! ఆడిని తిననివ్వవా?" అని అడిగింది.

"తినమనే సెపుతున్నా. ఆడు మామోలు మనిసి కావాలా అనుకుంటే కోడల్ని తెస్సి ఇంటిలో ఎట్టు మనవరాలు ఆడికి సేరిక అయేలా సూడూ, ఆనాడు పాలతనంతో పిల్లల్లిద్దరికి రుణం తెగిపోయినాది అనుకొని ఆడి పేరుకు మనవరాలు ఉన్నాది. ఆడు పోయిననాడు ఏడ్సుకొని కోడల్ని దాని అమ్మా అయ్యా తీసుకు పోయినారు. మరి మనము కోడల్ని పిలుపు ఎట్టనేదు" అన్నాది. సిన్నపు నాయుడు పోయిన్నాడు వాడి శవాన్ని ఎత్తుగా నులక మంచంపై కూర్చోబెట్టి కింద నేల మీద కోడల్ని కూర్చోబెట్టి ఇద్దరికి కలిపి చేయించిన పాల స్నానం దృశ్యం కళ్ళముందు కదిలినట్టు అయి అంకమ్మ ఏడుపు ప్రారంభించింది. "నాయనా – నాయనా ఎంత పని సేసినావురా మావ కూతురునీ సేసుకో అని బతిమాలినాను అది బాగానేదు ఈ పిల్ల బాపనాల పిల్లలా తెల్లగా సక్కగా ఉన్నాది అని నా మాట ఇనుకోనేదు. రైతుబిడ్డకి సక్కదనం ఏటి, అని సెపినా వినుకోనేదు, దీని నుదుట ముందరాత నీ ప్రానాలు తీసేసినాదిరా..." అంటూ ఏవేవో వర్లిస్తూ ఏడుస్తున్నాది.



''ఎందే నన్ను గసిరినావు నీవు ఎడుత్తున్నావు. మనవరాలు గావాలా పర్సిగాడు భీతాపన పోవాలా అని నీవు తలిత్తే కోడల్ని ఏటి అనకు" అని గట్టిగా చెప్పింది ముసలిది. ముసల్ది అన్న మాటల్లో నిజం గ్రహించిన అంకమ్మ కోడలు వరాలుకి కబురు పెట్టింది.

వరాలు తండ్రి వరాలు తల్లితో "ఈలు మరి మన అమ్మిని తలవరు అనుకున్నామె. ఇప్పుడు కబురు పంపినారు ఏటి సెయ్యాలా? ఆనాడు మనకి కొడుకులు నేరు మా సిన్న తమ్ముడికి వరాని ఇస్సి తమ్ముడిని నీవు ఇల్లరికం తెద్దామా? అని అడిగినప్పుడు నాను కాదు అనినాను? సిన్నపునాయుడు మీ తమ్ముడి కన్నా సిన్నోడు, ఆత్తి ఉన్నోడు, మేట్టరు ఉద్దోగం సేస్తున్నాడు అని పిల్లని ఇస్సినాను. ఆడి దారి ఒట్టుకు ఆడు పోయినాడు. మన పిల్ల సిన్నపిల్ల ఇప్పుడు నుండి ఆడి పేరికి ఉండిపోయి జీవితం ఎలా గడుపుతాది. ఇప్పుడు వరాల కూతురు సిన్నపిల్ల. ఆడుపోయిన కేసు తేలెసరికి కొంత టైము అవుతాదా నారిఓనరు ఏటి ఇత్తాడో ఏటి నేదో తేలిపోతాది. వరాల కూతురు కొంత ఉదారుగా అయిపోతే ఆల మనవరాల్నీ ఆలకి అప్పసెప్పి మన అమ్మికి నీ తమ్ముడికి మారు మనువు సేసెద్దాం అనుకోని ఆలు కబురు ఎట్టకపోయినా వల్లక ఉన్నాను. ఇప్పుడు ఏటి సెయ్యాలా?" అంటూ భార్యని సలహా అడిగాడు.

"ఓసారి పిల్లని ఆలికి ఇస్సినాకా సులువుగా తెగిపోతాదా ఏటి, ఆలు కబురు ఎట్టినారు పంపుదాం. మరసటి రోజే నీవు ఎల్లి మన అమ్మిని మరలా తీసుకువస్సి" అని సలహా చెప్పింది.

ఇంటికి వచ్చిన కోడల్ని కౌగిలించుకొని ఏడ్చింది అంకమ్మ. మరునాడు వంటపని కోడలికి అప్పజెప్పి మనవరాలిని పర్సినాయుడి వడిలో కూర్చోబెట్టి తను పొలానికి తట్టపట్టుకొని బయలుదేరింది. పిల్ల తాత వడి నుంచి దిగి తల్లి వెంట తిరుగుతున్నాది. పర్సినాయుడు మళ్ళీ పిల్లని ఎత్తుకున్నాడు. పిల్ల ఏడుపు ప్రారంభించింది. పిల్లని దాని తల్లికి అప్పచెప్పాడు. కొడుకు పోయినప్పటి నుండి తను క్షౌరం చేయించుకోలేదు, తనని చూసి పిల్ల జడిసిపోయిందని గ్రహించిన తన మనసు చిన్న బోయింది. కోడలు కాసేపు పిల్లని ఓదార్చి పిల్లని తాతకి అప్పజెప్పి మళ్ళీ పని ప్రారంభించింది. ఓ గిన్ని నేలపై ఉంచి గిన్నెపై చెమచాతో బాది చప్పుడు చేసి చూపాడు పర్సినాయుడు. పిల్ల కొంతసేపు అలా ఆడుకున్నాది కాని మల్లి తల్లి వెంట తిరగడం ప్రారంభించింది. కోడలితో ఏమి మాటలాడాలో, తనని ఎలా ఓదార్చాలో తోచక ముభావంగా ఊరుకున్నాడు పర్సినాయుడు. కోడలు అన్నం వార్చడానికి పెరటిలో రోలుపై గిన్ని పెట్టింది. పిల్ల అటువైపు వెళ్ళడం చూసిన పర్సినాయుడు త్వరగా వెళ్ళి పిల్లని పట్టుకున్నాడు. పిల్ల ఏడుపు ప్రారంభించింది. పిల్లని భుజాన వేసుకొని కోవటి కొట్టువైపు నడిచాడు. కొట్లో ఫైవ్‌స్టార్ చాక్లెట్ కొని విప్పి పిల్ల చేతికి ఇచ్చాడు. పిల్ల తినడం ప్రారంభించింది. సరిగ్గా పట్టుకోవడం చేత కాక నేలన పడేసింది. కొట్టు దగ్గర ఉన్న కుక్క ఆ చాక్లెటు అందుకున్నాది. పిల్ల మళ్ళా ఏడుపు ప్రారంభించింది. మళ్ళీ పది రూపాయలు నోటు ఇచ్చి చాక్లెటు కొన్నాడు. కోవటి కొట్టు ఎదురుగా బెంచిపై కూర్చుని ఉన్న అచ్చిగాడు – "సాకనేటు ఓడి అమ్మి ఓడి! మీ తాతకి ఏటి !! మల్లి కొంటాడు' అన్నాడు. ఆ మాటలు విన్న పర్సినాయుడు మనసు గతంలోకి వెళ్ళిపోయింది.

ఇప్పుడు పిల్ల తినగలిగినన్ని కొనగలను. ఒక్కపుడు రూపాయి రూపాయికీ ఎన్ని కట్టాలు ఓడినానో, ఊరి పొలిమేరన కొండ వద్దకు పోయి నాలుగు తాటి సెట్లు కమ్మ కొట్టి కావాలి అన్న వాలకి అందిస్తే రొండు రూపాయలు ఇస్సేవారు. సీకటినే సాలిసాలని సల్ది మెతుకులు కడుపులో ఏసుకు ఇల్లు ఒగ్గేవాడిని, పొద్దంతా కట్టబడి పొద్దోయి ఇంటికి ఎల్లేటప్పుడు కోవటి కొట్టు కాడా నూనే వర్రా సింతపండు కొనేటప్పుడు సీసాలో ఉన్న పప్పు ఉండలు, సేగోడియాలు సూసి కడుపులో భగ్గున లేసిన ఆకలి మంట ఆడుసుకు ఇంటి ఏవు పోయే దారిన నడిసేవాడ్ని. అంకమ్మ రోజంతా నీ ఇంటా నీ ఇంటా సిన్నా సితకా పని సేసి నూకలు సంపాదించి జావ కాసి నా రాకకి ఎదురు సూత్తూ కూకునేది. అది నిండుసూలాలుగా ఉన్న రోజుల్లోనైనా దాని సేతిలో వాపు తీరేందుకు ఏనాడు ఏటి ఎట్టనేకపోయినాను. సిన్నపునాయుడి సిన్నపుడు ఏనాడు ఓ సాకలెటు కొని ఎట్టనేదు.

గతం ఆలోచిస్తూ ఇంటికి వచ్చాడు పర్సినాయుడు. పొలంకి వెళ్ళిని అంకమ్మ ఇంటికి వచ్చింది. కోడలు ఏవిటి వండిందో గిన్ని మూతలు తీసి చూస్తున్నాది. అప్పుడు కోడలి తండ్రి వచ్చాడు..

"ఏటన్నో పిల్ల ఎమ్మటే వస్సినావు" అని పలకరించింది అంకమ్మ.

"అమ్మిని అంపిన ఎమ్మట మీ వదినకి జరం వస్సినాది. అమ్మిని తీసుకుపోదాం" అని గొణిగాడు.

ఏటేటీ –అపుడే కోడల్ని తీసుకుపోతావా... రా ముందు పిడసదు బువ్వ తిను అంటూ వడ్డించింది. తిన్నాక ఎన్ని విధాలు చెప్పినా వినలేదు. వరాల తండ్రి వరాలను తీసుకుపోయాడు.

# సెప్టెంబర్ నెల పురస్కారాలు





| | |
|---|---|
| **ఆలంబన** | **కన్నీళ్ళు** |
| **కథకు........రూ.700/-** | **కవితకు.......రూ.500/-** |
| రచయిత : **పోపూరి సురేష్‌బాబు** | రచయిత : **డమాముల గాయత్రి** |

***సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.***

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

**- ఎడిటర్**

ఆ తర్వాత అంకమ్మ కోడల్ని పిలుపు పెట్టినా వారు పంపిన మరునాడే దాని తండ్రి వచ్చి కూతుర్ని మనవరాల్నీ తిరిగి తీసుకుపోయేవాడు.

ఓసారి పర్సినాయుడు కోడలితో...

అమ్మా నీకు ఏటి బెరుకు, ఎప్పటికి ఇదే నీ ఇల్లు. నా సిన్ననాడు కట్టపడిననాడు పొయ్యిలో అగ్గి ఏసేవాల్లము నేక పోతే నేదు. ఇపుడు కొద్దో గొప్పో ఆత్తి సంపాదింసినాము. మనసు ఇప్పి సెప్పు ఆత్తి పిల్ల పేరున రాస్తాను. పిల్ల మైనారిటీ తీరేకా నీ పేరున అయినట్టు రాత్తాను. నీకు కట్టపడటం ఇట్టం నేకపోతే భూమి కౌలుకి ఇస్సి ఇంటి కాడ కూకోని తిన్నా దినము తీరుతాది. మావు పండు ఆకు వంటి వాలం ఎపుడు రాలిపోతామో తెల్దు. నీవు ఎరవసూపకు ఇక్కడే ఉండిపో తల్లి" అని బతిమాలాడు. ఆ రోజు కోడలు తండ్రికి ఫోన్ చేసి రప్పించుకు వెళ్ళిపోయింది. తను చెప్పిన దానిలో తప్పు ఏవిటో ఎంత ఆలోచించినా పర్సినాయుడికి అర్థం కాలేదు. వాళ్ళు కోడలికి మరి కబురు పంపలేదు. తను రాలేదు.

ఓ రోజు కోడలి ఊరువాడు రెల్లి చింతెయ్య నాటు కోళ్ళు కొనేటందుకు పర్సినాయుడి ఊరుకి వచ్చాడు.

"ఏటి సింతెయ్యో మా ఊరిపై పడ్డావు! మా కోడలు బాగుందా?" అని అడిగాడు పర్సినాయుడు.

"ఏటి అలా అడుగుతావు! నీకు తెల్దా ఏటి? మీ వియ్యంకుడు తన బామ్మర్దిని తన ఇంట తెస్సి ఎట్టుకున్నాడు. సిన్నపునాయుడి కేసు తెగిపోతే కూతురికి రోటికాడ ముడి ఏస్తాడుట. మీ వీరకత్తె ఆ రోజు నూతికాడ నీల్లకి వస్సినాది. వరా తన మేనమామతో సినిమాకి ఎల్లినాదిట. పిల్ల ఏడుస్తున్నా పట్టించుకోక తను నీల్ల బిందెలు మోత్తూనే ఉంది. పాపం పిల్లని సూసి నాకు సాలా జాలేసినాది అనుకో" అని చెప్పాడు చింతెయ్య. ఆ చెప్పడం పితూరీలాగా చెప్పినా పర్సినాయుడుకు తప్పనిపించలేదు.

రెండవరోజు తెల్లవారేసరికి పర్సినాయుడు మంగలాడిని పిలిచి మునుపటి వలే క్షౌరం చేయించుకొని, గెడ్డం గీయించుకొని, మీసాలు దిద్దించుకొని తెల్లటి పంచలాల్చీ కట్టుకొని డబ్బు అవసరమైన సామాన్లు పట్టుకొని - "నాను కోడలి కన్నవారి ఊరుకు ఎల్లుతున్నాను, పిల్లని సేరిక సేసుకొని ఆల్లని అడిగి పిల్లని ఒట్టుకు వత్తాను నా రాకకి ఎన్నాలు అయినా దిగులు ఒట్టుకోకు" అని అంకమ్మకి చెప్పి బయలుదేరాడు.

దసరా రోజులు అవి ఊర్లో పెద్ద కాపులు చిడతలు వేస్తున్నారు.

"తోడు గూడు కెల్లుదాము, తోడ నింట కేగుదాము

కూడదయ్యా సిత్తరాంగి మెడకేగుటా.. సిత్తరాంగి మెడకేగుటా...'

అప్పుడు పర్సినాయుడు మనవరాల్ని భుజంపై కూర్చోపెట్టుకొని వచ్చి చిడతలు వేస్తున్న వాళ్ళ దగ్గర నిలబడి - "కూడదయ్యా సిత్తరాంగి మెడకేగుటా..." అంటూ పాడుతూ వరస కలపడం ప్రారంభించాడు. భుజాన కూర్చొని ఉన్న పిల్ల నవ్వుతున్నాది. ఒక యువకుడు - "ఏటి తాతో వయసినవాడివీ అయినావా ఏటి" అంటూ అడిగాడు.

"అయినాను రా అయినాను! ఆ రోజు కోవిలలో పూజారిగారు సెప్పినారు ఆలకింసినావా? మారాజు యయాతి సాపం వలన ముసిలాడు అయినాడుట. అపుడు ఆడి కొడుకు తన అయ్యకి తన వయసు దారపోసినాడట. మళ్ళీ పెళ్ళి సేసుకొని కోడలు హాయిగా వుండనీ. నా కొడుకు వయసు కాదు జీవితం ధారపోసి నన్ను ఆడి పిల్లని పెంచమని సెప్పినాడు."

"ఏటి తాతా నీవు అన్నది అసలు అరదం కానేదు?"

"ఇదిగోరా నా సిన్నపునాయుడు" అంటూ బుజాన్న ఉన్న పిల్లను చూపుతూ

"అప్పుడు ఆడిని పెంచినాను ఇప్పుడు దీనినీ నాను పోసించాలా పెద్ద సెయ్యాల

అంటే నాను వయసైన వాడు కావాలా" అని సమాధానం చెప్పాడు.

•

## పాదముద్రలు

**- సలీం**

ఎడారి లాంటి జీవితం
ఎన్ని ఇసుక తుఫాన్లు
సమాధులై మొలుస్తాయోనన్న భయం
దారి కోసం వెతుక్కుంటూ
ఎటు చూసినా ఎండమావుల మయం
ఒయాసిస్సు కోసం
అనంత అన్వేషణ
గుక్కెడు నీళ్ళు
పిడికెడు ఈతపళ్ళు
ఎండని దాచేంత నీడ
ప్రాణం నిలవాలంటే
వెదుకులాట తప్పదు
ఎన్ని పాద ముద్రలో
గజిబిజిగా... వర్తులంగా
అన్ని వైపులకూ విస్తరిస్తో
గమ్యం చేర్చే నిచ్చెనలో



గుంతలోకి తోసే సెడతోవలో
తాడు పట్టుకుని ఎగబాకినట్టు
ఓ జతపాదాల గుర్తుల వెంటే
నడిచి నడిచి
అలా ఎన్నిటినో అనుసరించి
అలసిపోయి
ఎన్నివందల పాదాల గుర్తులున్నా
ఏమిటీ ప్రయోజనం
ఒక్కటైనా గమ్యం వైపుకు
లాక్కెళ్ళనప్పుడు
దారిచూపే పాద ముద్రలు
ఒక్కడైనా వేయకపోవడం
ఎంతటి విషాదం..
మనస్సాక్షి చూపిన దారిలో
నేనే ముందు తరాల కోసం
బలంగా పాదముద్రలు వేస్తూ..
ముందుకు సాగుతూ...

---

## నాకు మరణం లేదు

**- అడిగోపుల వెంకటరత్నమ్**

పంట కాల్వల పరుగులు
పచ్చని పొలాల సొగసులు
నౌకా విన్యాసాలు మత్స్య సంపదలు
సరంగుల తరంగాల సయ్యాటలు
జలస్తంభన విద్యల్ని చూస్తూ
నీటిని నిలగట్టి
మట్టిని జలమయం చేసిన
నన్ను జ్ఞప్తిస్తావు
నాకు మరణమెక్కడిది?
పరుగెత్తే రైల్లో
దూరవాణి స్తంభాల పలకరింపులు
వలస పక్షుల సహప్రయాణం
మోరెత్తిన జంతు సంపదలు
గాలి పటాల కేరింతలు
ఉరకలేత్తే నదీ ప్రవాహాలు
మెరిసే ఇసుక తిన్నెలు



జనారణ్యాల ఉరుకులు చూస్తూ
కుహరాన్ని చేధించిన కూతకు
ఉలిక్కిపడి
పొగబండి సృష్టికర్త
నన్ను జ్ఞప్తిస్తావు
నాకు మరణ మెక్కడిది?

ఆకాశంలోకి దూసుకెళ్ళి
పవన తనయుడై పయనిస్తూ
నగరాలు బొమ్మల కొలువులై
మనుషులు చీమలబారులై
నదుల మెలికల తీగలై
అడవులు పచ్చని తివాసీలై
విశ్వాన్ని వీక్షిస్తూ
లోహ విహంగ నిర్మాత
నన్ను జ్ఞప్తిస్తావు
నాకు మరణమెక్కడిది?

మరణం వుంది
నిద్రకు నిద్రకు మధ్య
బద్ధకం వహించే నీకు
బద్ధకంలోనూ నిద్రలోకి
జారిపోయే నీకు
మరణం వుంది!

# అద్దేపల్లి రామమోహన్‌రావుకు చిన్నప్ప భారతి పురస్కారం






తమిళనాడుకు చెందిన ప్రముఖ ప్రగతిశీల రచయిత చిన్నప్ప భారతి ఏర్పాటు చేసిన సాహిత్య పురస్కారానికి ఈ ఏడాది ప్రసిద్ధ ప్రజాకవి, విమర్శకుడు డాక్టర్ అద్దేపల్లి రామమోహన్‌రావు ఎంపికయ్యారు. ఈ అవార్డు కింద ఆయనకు యాభై వేల రూపాయల నగదు, పురస్కార పత్రం అందిస్తారు.

నిరంతర సృజనకారుడుగా నిత్య సాహిత్య సంచారిగా అద్దేపల్లి రామమోహనరావు అక్షరాభిమానులకు, అభ్యుదయవాదులకు సుపరిచితులు. 1936లో బందరులో జన్మించిన అద్దేపల్లి శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయంలో తెలుగు ఎంఎ బంగారు పతకంతో పూర్తి చేసి అధ్యాపక బాధ్యతలు నిర్వహించారు. 1968లో శ్రీశ్రీ మహాప్రస్థానంపై తొలి విమర్శక గ్రంథం, 1969లో ఉమర్ ఖయ్యాం రుబాయత్‌ల అనువాదం 'మధుజ్వాల' ప్రచురించారు. తొలి కవితా సంపుటి 'అంతర్జ్వాల' 1970లో వెలువడింది. రక్తసంధ్య, గోదావరి నా ప్రతిబింబం, మెరుపు పువ్వు, సంఘం శరణం గచ్ఛామి, అయినా ధైర్యంగానే, ఆకుపచ్చని సముద్రం నా నేల, తెరలు ఆయన ఇతర కవితా సంపుటాలు. వివిధ సాహిత్యోద్యమాలతో సంస్థలతో ఆయనకు సన్నిహిత సంబంధం వుంది. కొత్తవారిని ప్రోత్సహిస్తూ ప్రతివారితో స్నేహశీలంగా వుంటూ అనేక సేవలందిస్తున్నారు. 'అభ్యుదయ, విప్లవ కవిత్వంలో సిద్ధాంతాలు, శిల్పరీతులు' అన్న అంశంపై పరిశోధనకు డాక్టరేట్ పొందారు. ఇప్పటికి 14 విమర్శక గ్రంథాలు ప్రచురించారు. గజల్ రచయిత, గాయకుడు కూడా. గతంలో శ్రీశ్రీ, బోయి భీమన్న, తిలక్ అవార్డులతో పాటు వివిధ పురస్కారాలు పొందారు. కాకినాడలో ఎక్కువ కాలం పనిచేసి 1999లో పదవీ విరమణ చేశారు.

పొగచూరిన ఆకాశంలో అద్దేపల్లి ప్రపంచీకరణ నేపథ్యంలో సామ్రాజ్యవాద పోకడలను, దేశంపై రాజకీయ ఆర్థిక దుష్ప్రభావాలను సాంస్కృతిక కాలుష్యాన్ని ప్రతిభావంతంగా అక్షరీకరించగలిగారని అవార్డు కమిటీ అభిప్రాయపడింది. మారుతున్న కాలాన్ని ప్రతిబింబించే అనేక కవితా ప్రతీకలు, పదబంధాలు, కవితాత్మక చిత్రణ ఇందులో చూడగలుగుతాము. ప్రధానంగా ఈ కవితా సంపుటితో పాటు అద్దేపల్లి నిబద్ధ జీవితాన్ని నిరంతర సాహితీ కృషిని కూడా గౌరవిస్తూ ఎంపిక జరిగింది. చిన్నప్ప భారతి ఈ పురస్కారం ఎంపికపై హర్షం వ్యక్తం చేస్తూ అక్టోబర్‌లో చెన్నయ్‌లో పురస్కార ప్రధానం జరుగుతుందని తెలిపారు. తర్వాత తిరుపతిలో కూడా సభ జరుగుతుంది.

ఈ సందర్భంగా డా॥ అద్దేపల్లి రామమోహనరావుకు అభినందనలు తెలియజేస్తున్నాము. అవార్డు ఎంపికకు రచనలు పంపి సహకరించిన రచయితలు కవులందరికీ హృదయ పూర్వక కృతజ్ఞతలు.

**– తెలకపల్లి రవి, సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు**

చిన్నప్పభారతి తమిళంలో సామాజిక విప్లవకర ఇతి వృత్తాలతో రాసిన కథలు నవలలు బాగా ప్రజాదరణ పొందాయి. వాటిలో సంఘం, చక్కెర, తెలుగులో కూడా అనువాదమైనాయి. ప్రతి ఏటా తమిళంతో పాటు ఒక దేశీయ భాషా రచయితకు పురస్కారం అందించడం ఆయన ఆనవాయితీగా చేసుకున్నారు. ఆ క్రమంలో ఈ ఏడాది తెలుగు భాషా రచయితకు ఇవ్వనున్నారు. చిన్నప్ప భారతి కోరిక మేరకు సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ఏర్పడిన న్యాయ నిర్ణేతల కమిటీ తెలుగు రచయితలు కవుల నుంచి ఎంట్రీలను ఆహ్వానించింది. అవార్డు కోసం పలువురు ప్రముఖుల రచనలతో సహా వివిధ ప్రక్రియలలో 250 పుస్తకాల వరకూ అందాయి. వాటన్నిటిని పరిశీలించిన న్యాయ నిర్ణేతల బృందం అద్దేపల్లి రామమోహన్‌రావు కవితా సంపుటి 'పొగచూరిన ఆకాశం' ను అవార్డుకు ఎంపిక చేసింది.



చిన్నప్ప భారతి

# మనిషి మనుగడకు అత్యవసరం చీకట్లు ఛేదించే సాహిత్యం




- ఝాన్సీ కె.వి. కుమారి

కవి భవిష్యత్తులోకి దృష్టి సారించి చేసిన ఊహలను శాస్త్రవేత్తలు ప్రయోగశాలల్లో ప్రయోగాలు చేసి కొంతకాలానికి వాస్తవ రూపాలుగా మన కళ్ళముందు నిలుపుతారు. ఐజక్ అసిమోవ్ రచనలే అందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు. అతని బాటలోనే ఆ తర్వాత ఎందరో రచయితలు చేసిన ఊహాపోహలే సైన్స్ ఫిక్షన్‌గా అంతరిక్షాన్ని అరచేతుల్లో నిలపగా ఆ అక్షరాలకు స్పేస్‌క్రాఫ్టుల రెక్కలు తొడిగి మనిషి స్వాధీనంలోకి తెచ్చే ఏర్పాటు చేస్తున్నారు. అందని చందమామ అరచేతిలో అమరిన పండు అయింది. భూత వర్తమానాలను సాహితీకారుడు సత్యదృష్టితో చూసి, అక్కడి చీకటి కోణాలను కనిపెట్టగలగాలి.

మనందరికీ తెలుసు. హితంతో కూడినదే సాహిత్యం అనబడుతుందని. కొంత మేలును పంచిపెట్టి, కొందరిని కీడులోనికి నెట్టేది కాదు. అందరి ప్రయోజనం కోసం అవసరమైన చోట హెచ్చరిస్తూ, సరిచేస్తూ, శిలలను శిల్పాలుగా చెక్కుతూ, హృదయ క్షేత్రాలనూ, అవి పయనించే మార్గాలను చేరే గమ్యాలనూ కూడా కాంతిపుంజాలుగా వెలిగించేదే సాహిత్యం!

సాహిత్యాన్ని సృష్టించే మనిషి కవిగానీ, రచయితగానీ (స్త్రీలు, పురుషులు) సామాన్య (average) మానవ సమాజానికి వందేళ్ళు ముందుకు వెళ్ళి మనోనేత్రాలతో కాలాన్ని చూస్తాడు. అందుకే అతణ్ణి దార్శనికుడు అంటారు. భవిష్యత్‌నే కాదు, భూత వర్తమానాలను కూడా పరికిస్తాడు కవి. భావిని దూరదృష్టి fasthest sight తో చూస్తే, భూత వర్తమానాలను లోదృష్టి inword insight తో చూస్తాడు.

కవి భవిష్యత్తులోకి దృష్టి సారించి చేసిన ఊహలను శాస్త్రవేత్తలు ప్రయోగశాలల్లో ప్రయోగాలు చేసి కొంతకాలానికి వాస్తవ రూపాలుగా మన కళ్ళముందు నిలుపుతారు. ఐజక్ అసిమోవ్ రచనలే అందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు. అతని బాటలోనే ఆ తర్వాత ఎందరో రచయితలు చేసిన ఊహాపోహలే సైన్స్ ఫిక్షన్‌గా అంతరిక్షాన్ని అరచేతుల్లో నిలపగా ఆ అక్షరాలకు స్పేస్‌క్రాఫ్టుల రెక్కలు తొడిగి మనిషి స్వాధీనంలోకి తెచ్చే ఏర్పాటు చేస్తున్నారు. అందని చందమామ అరచేతిలో అమరిన పండు అయింది. భూత వర్తమానాలను సాహితీకారుడు సత్యదృష్టితో చూసి, అక్కడి చీకటి కోణాలను కనిపెట్టగలగాలి. హ్రస్వదృష్టి, పాక్షిక దృష్టి, సంకుచిత దృష్టి, వక్రదృష్టి ఉంటే లోపాలను కనిపెట్టలేడు. సత్యాన్ని స్పష్టంగా చూడాలంటే చూపు నిర్మలంగా ఉండాలి. జరిగిన, జరుగుతున్న తప్పులను ఎత్తిచూపడానికి, సరిచేయడానికి వ్యాధి నిర్ధారణ చేసి చికిత్స ప్రారంభిస్తాడు కవి. అప్పుడే

:
"నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం అంటాడు...
"జఢమైన జగంలో ప్రశ్నలెక్కడివి :
సూర్యకిరణాల ఉషస్సు లెక్కడివి?

అని ప్రశ్నించగలుగుతాడు.

జరిగిన, జరుగుతున్న కాలంలో లోపాలను, జరగబోయే కాలంలో చేసుకొనవలసిన మార్పులను సరైన రీతిలో విశ్లేషించి అక్షరాల రూపంలో సమాజానికి అందించే సాహితీకారుడు సృజనశీలుడు. అందుకే చలం అన్నాడు.

"తనకీ ప్రపంచానికీ సామరస్యం
కుదిరేదాకా కవిచేసే అంతర్
బహిర్ యుద్ధారావమే కవిత్వం అని!

ప్రపంచ సాహిత్యం ఈ పనిని సమర్థవంతంగా నిర్వహించింది. గత తరం చేసిన తప్పులను ఎత్తిచూపింది. తోటి మనిషిని బానిసగా చేసుకున్న అమానవీయ కాలాన్ని ఖండించింది. సాంఘిక మానసిక, రాజకీయ విప్లవాలకు బీజం వేసింది. అదే ఉవ్వెత్తున ఎగసి 'పునరుజ్జీవనం' అనబడిన Renaissance ఫలితంగా మనిషి కేంద్రంగా చట్టాలు, ప్రభుత్వాలు ఏర్పడతాయి.

కాని, మన దేశాన్ని రినేజాన్స్ పలకరించలేదు. తలుపుతట్టి, పక్కనుండే వెళ్ళిపోయింది. నిజానికి స్వాతంత్ర్యోద్యమంతో పాటు సమాంతరంగా సాగిన సంస్కరణోద్యమం సమాజంలోని అన్ని అవకతవకలను ఎత్తి చూపింది. వాటి నిర్మూలనకు కవులు కలం యుద్ధం చేశారు.

కొందరు స్వార్థపరులు ప్రజలు తమ చెప్పుచేతల్లో ఉంచుకునేందుకు, పోటీలేని పెత్తనాన్ని నిరంతరం చెలాయించేందుకు ప్రజల మధ్య "ఎన్నటికీ" ఐక్యత లేకుండా "కులం" అనే దుష్టకుట్రను పన్ని - మత మౌఢ్యాన్ని కావలిగా ఉంచారు. సంస్కరణల కాలంలో కవులు కలం పోరాటం చేశారు గానీ. తర్వాతి తరం మాత్రం "మహదీర్ఘ" మౌనాన్ని ఆశ్రయించింది.

కులం ఎక్కుపెట్టిన విషం నిండిన బాణం బాల్యం నుండే - ఊహ కూడా పెరగక ముందే - క్షణ క్షణం గుచ్చుతుంటే, అంబేద్కర్

**దేశం మొత్తం రెండు వర్గాలుగా చీలిపోయింది. ఒడ్డున ఉన్నవాడు, సుడిగుండంలో చిక్కుకున్నవాడు, బాణం ఎక్కుపెట్టినవాడు, గుండెలో గుచ్చే బాణాన్ని నిరంతరం మోస్తున్నవాడూ – వీళ్ళే అస్మదీయులు, తస్మదీయులుగా విడిపోయారు. దురదృష్టవశాత్తు స్వాతంత్ర్యానంతర సాహిత్యం అదేబాట పట్టింది. ఎవరి కేకలు వాళ్ళే వేయాల్సి వచ్చింది.**

మాత్రమే కాదు, ఆ స్థితికి బలమైన ఏ వ్యక్తి అయినా అనవలసిన మాట.

"అసమానతల పునాది మీద
ఏ జాతినీ నిర్మించలేం" అని!

అన్ని దేశాల్లో... అన్ని కాలాల్లో ఇది సత్యం. దేశాలూ.. సమాజాలకే కాదు, కుటుంబాలకూ వర్తిస్తుంది ఈ మాట. తనపై తానే వ్యతిరేకంగా లేచిన ఏ రాజ్యమూ నిలవదు అంటారు పెద్దలు. సత్యానికి మసిపూయడం సాహిత్యం చేయదు. చేస్తే అది సాహిత్యం కాదు. జీవితాన్ని ఛిద్రం చేసే క్షుద్రపన్నాగాల అటువంటి వాటిని సాహిత్యంలో జొరబడకుండా సాహితీలోకం జాగ్రత్తపడాలి.

పునాదిలోనే పడిన వ్యాధిని నిర్మూలించకపోతే ఆ కట్టడం ఎక్కువ కాలం నిలవదు. పేరుకు తెగులు పట్టుకుంటే ఆ చెట్టు ఏ క్షణమైనా కూలిపోతుంది. దేశ పునాదుల్లో పడిన 'అసమానతలు' అనే వ్యాధి నిర్ధారణ జరిగిందే గానీ వ్యాధి నిర్మూలనకు ఈ దేశ నాయకత్వం అంకితం కాలేదు. విభజించి పాలించడంలో లాభాలను లెక్కవేసుకున్నారు. అమాయక ప్రజలు పావులుగా బలవుతున్నారు. సుడిగుండంలో చిక్కుకున్నవాడే మునిగిపోతూ కేకలేస్తాడు. ఒడ్డున్న వున్న వాడికి ఆందోళన ఏముంటుంది? వీలును బట్టి సాయం చేద్దామనుకుంటాడు!

దేశం మొత్తం రెండు వర్గాలుగా చీలిపోయింది. ఒడ్డున ఉన్నవాడు, సుడిగుండంలో చిక్కుకున్నవాడు, బాణం ఎక్కుపెట్టినవాడు, గుండెలో గుచ్చే బాణాన్ని నిరంతరం మోస్తున్నవాడూ – వీళ్ళే అస్మదీయులు, తస్మదీయులుగా విడిపోయారు. దురదృష్టవశాత్తు స్వాతంత్ర్యానంతర సాహిత్యం అదేబాట పట్టింది. ఎవరి కేకలు వాళ్ళే వేయాల్సి వచ్చింది.

స్వాతంత్ర్యానికి పూర్వం 'అందరికీ ఒక్కడు, ఒక్కరి కోసం అందరు' అన్న బాటన నడిచారు. ప్రముఖ తమిళ కవి సుబ్రహ్మణ్య భారతి 1915 ప్రాంతాల్లోనే 'గంటలు మోగించండి' అంటూ రాశారు.

"భారతదేశంలోని ప్రజలందరూ ఏకో
దరులు. జాతి భేదం, మత భేదం,
కుల భేదం, భాషా భేదం ఏమీ లేవు
సత్యాన్ని ఆశ్రయించకుంటే
దృష్టి సవ్యంగా ఉంటుంది.
అందరిదీ ఒకే జాతి
అందరూ భారతీయులు
అందరూ ఈ దేశపు రాజులు
మహిళను నీచంగా చూసే మౌఢ్యాన్ని కాల్చేద్దాం"

ఆ రోజుల్లోని ఆ స్ఫూర్తి తర్వాతి దినాల్లో కానరాకపోవడమే కాక కులసంఘాలు విచ్చలవిడిగా పెరిగిపోవడం, మత మౌఢ్యాలు పెచ్చరిల్లడం నిరాటంకంగా సాగాయి.

ఈ దేశం ఎదుర్కొంటున్న అన్ని సమస్యలకు ఆ ఒక్కటే కారణమని అర్థం చేసుకున్న మహా మేధావి అంబేద్కర్. దాని నిర్మూలన కోసం ఒంటరి పోరాటం చేశాడు. కుల మూలాలను శోధించి, స్వార్థమొక్కదాన్ని సృష్టించిందని నిద్రాణమైన జాతిని మేల్కొల్పడానికి గొప్ప పోరాటం చేశాడు. ఎన్ని ప్రశ్నలు వేశాడు. ఎన్ని మూర్ఖత్వాల గుట్టు రట్టు చేశాడు. అనవద్దు... వినవద్దు... కనవద్దు అన్న వద్దుల హద్దుల్లో పెరిగిన భారతజాతి ఆ ప్రశ్నలకు జవాబులను ఆలోచించడానికి ఇష్టపడలేదు. ఆ ఒక్క కారణం వల్లనే మన దేశం ఇంకా ఇంకా తిరోగమనంలోనే ఉంది. మిగిలిన దేశాలు స్వాతంత్ర్యం సాధించుకున్న అనతికాలంలోనే నిరాటంకంగా అభివృద్ధిపథంలో దూసుకుపోతున్నాయి.

మన దేశానికి వచ్చిన స్వాతంత్ర్యం అర్ధరాత్రి స్వాతంత్ర్యం అనబడింది. చీకటి శక్తులకే ఈ స్వాతంత్ర్యమని నేటికీ దేశమంతా గగ్గోలు పెడుతూనే వుంది. స్వాతంత్ర్య ఫలాలు అందని కోట్లాది మంది ప్రజలను గురించి పూర్వ రాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్ ప్రభుత్వాలను హెచ్చరిస్తూనే ఉండేవారు. ఆకలి చావులు లేని, ఆకలి కేకలు వినబడిన రోజు కోసం ఎంతకాలం ఎదురుచూడాలో...

ఈ 64 ఏళ్ళల్లో 11 పంచవర్ష ప్రణాళికల్లో ఎన్ని లక్షల కోట్ల రూపాయలను పేదరిక నిర్మూలన కోసం కేటాయించి గమ్యాన్నెందుకు చేరలేదు? మన రోడ్ల పరిస్థితి ఎంత అధ్వాన్నం? ఎన్ని కోట్లు మింగి ఉంటాయి? ప్రతి రంగం గురించి ఈ ప్రశ్నలు వేసుకుంటే జవాబులు మనకు తెలుసు. అవినీతి తిమింగలం బలిసిపోతున్న తీరు కళ్ళెదుట సాక్షాత్కరించి లంచం ముట్టనిదే పనిచేయని నాయకులు, ఉద్యోగులు ఈ భారతమంత పిల్లలే... ఎవరి జీతాలు వాళ్ళు తీసుకుంటున్నవారే... ఆ జీతాలకు పనిచేయవలసినదే – చేయరు. "మనవాడేనోయ్, పనికానిచ్చేయ్" అన్నది అస్మదీయుల మాటైతే, "నీకు చేస్తే నాకేంటి అనే తస్మదీయుల ప్రశ్న తోటి పోరులకే. చైనా వాళ్ళో, పాకిస్తానీయులకో కాదు (డాలర్లు గుమ్మరిస్తే వాళ్ళకు హాయిగా పనులవుతాయి, బాంబులు పేలతాయి, ప్రాణాలు గాల్లో కలుస్తాయి!).

"ఇక్కడ... అన్నీ అమ్ముడుబోయే బతుకులే.
ఇక్కడ... అన్నీ అంగట్లో దొరికే సరుకే
జైకొట్టేవాళ్ళూ
జేబు కొట్టేవాళ్ళూ
తాళి కట్టేవాళ్ళూ
పాడి కట్టేవాళ్ళూ
బేరాలాడి చూడు..
ఏదీ దొరక్కపోదు..."

'శిథిలస్వప్నం' స్వీయ సాహిత్యం ఉద్యమాల్ని ప్రభావితం చేస్తాయి. ఉద్యమాలు సాహిత్యానికి ప్రాణం పోస్తాయని అంటుంటారు. మానవత్వం నిలువునా హత్య చేయబడిన కారంచేడు, చుండూరు, ఖైర్లాంజి సంఘటనలను మనం కళ్ళ ముందే చూశాం. ఖైర్లాంజి మానవ పతనాన్ని నాల్గు రోజుల వరకూ ఎవరూ పట్టించుకోలేదు కూడా. నటి శిల్పాశెట్టికి ఇంగ్లండ్ టీవీ షోలో అవమానం జరిగిందని దేశమంతా

**'శిథిలస్వప్నం' స్వీయ సాహిత్యం ఉద్యమాల్ని ప్రభావితం చేస్తాయి. ఉద్యమాలు సాహిత్యానికి ప్రాణం పోస్తాయని అంటుంటారు. మానవత్వం నిలువునా హత్య చేయబడిన కారంచేడు, చుండూరు, ఖైర్లాంజి సంఘటనలను మనం కళ్ళ ముందే చూశాం. ఖైర్లాంజి మానవ పతనాన్ని నాల్గు రోజుల వరకూ ఎవరూ పట్టించుకోలేదు కూడా. నటి శిల్పాశెట్టికి ఇంగ్లండ్ టీవీ షోలో అవమానం జరిగిందని దేశమంతా గగ్గోలు పెట్టిన ఘటనకు మనం ప్రత్యక్ష సాక్షులం...**

గగ్గోలు పెట్టిన ఘటనకు మనం ప్రత్యక్ష సాక్షులం... అంటే బాధితులందరినీ - భారతీయులందరూ సోదరులుగా కాకపోయినా తోటి పౌరులుగానైనా చూడలేని తత్వం మన రక్తంలోనే మాయమయిందన్నమాట అక్షర సత్యం కాదూ?

ఉద్యమం సంగతి అటుంచి, ఈ అన్ని సంఘటనల్లో సాహితీవేత్తలందరి (కొన్ని వర్గాలు కాదు) పాత్రను మనం ఖచ్చితంగా ఆశిస్తాం. చట్టం తన పని తాను చేసుకుపోతుందని ప్రజా ప్రతినిధులు తప్పించుకోవచ్చుగానీ, మనస్సును ప్రక్షాళనం చేయవలసిన కలం యోధులు తప్పించుకోలేరు. అది ఓ చారిత్రక తప్పిదమే అవుతుంది.

స్త్రీల సమస్యల గురించి స్త్రీలే కలం కదపాలా? గళం విప్పాలా? శతాబ్దాల తరబడి 'అంటరానివారనే అమానుషమైన పేరుతో జీవచ్ఛవాలుగా చేయబడ్డ భారత జాతి దళితులనే పేరుతో తమ అవమానాలను గబ్బిలాలకు మొరపెట్టుకోవలసిందేనా?

కొందరి మనోభావాలను నొప్పించాడన్న (?) నెపంతో ప్రజాస్వామ్య దేశంలో పౌరుడైన హుస్సేన్ గీతలకు హద్దులు పెట్టి దేశ సరిహద్దులను దాటించిన దేశం ఇది! మన స్త్రీలను, దళితులను జంతువుల కన్నా హీనం చేసి, పుట్టిన... పుట్టబోయే వాళ్ళ గుండెల్లో కూడా ఆ భావాలనే కల్పిస్తున్న వారికి ఏ శిక్ష వేయాలి?

ఇటీవల జరిగిన ఓ సభలో మాజీ మంత్రివర్యులు మండలి బుద్ధప్రసాద్‌గారన్న మాటలు అందరికీ కనువిప్పు కావాలి. భారత సమాజానికి తెలుగు సాహిత్యానికి క్రైస్తవులు చేసిన సేవకు భారతీయులు ప్రత్యేకించి తెలుగు వారందరు రుణపడి ఉండాలంటూ ప్రారంభించి, అచ్చు యంత్రం కనిపెట్టబడిన తర్వాత మొట్టమొదటిగా ముద్రించబడిన బైబిల్ గ్రంథం మానవ జీవితంలోనూ, ఆలోచనా విధానంలోనూ మార్పు తీసుకువచ్చిందన్నారు. మన ఆంధ్ర రాష్ట్రంలో బెంజమన్ షుల్ట్జ్ బైబిల్ నుండి సేకరించి రాసిన 'నూరు జ్ఞాన వచనాలు' తెలుగులో ముద్రించబడిన మొదటి గ్రంథమన్నారు. ఇండియన్ సివిల్ సర్వీసెస్ అధికారిగా బాధ్యతల్లో మునిగి కూడా చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ తెలుగు భాషకు చేసిన సేవ అద్భుతం, అనితర సాధ్యం అన్నారు.

వరదలై పొంగుతూ అపార ప్రాణ ధన నష్టాన్ని కలిగిస్తున్న గోదావరి జలాలకు ఆనకట్ట కట్టి సర్ ఆర్థర్ కాటన్ మనందరికీ ప్రాణదాత, అన్నదాత జలదాత, ప్రాతఃస్మరణీయుడు అంటూ, ఆంధ్రుల చరిత్రను వెలుగులోకి తెచ్చిన కల్నల్ మెకంజీ సేవలు, మదర్ థెరీసా ఇంకా ఎందరో త్యాగమూర్తుల సేవలు గుర్తు చేసి ఇది. చరిత్ర మనం విస్మరించరాదు అన్నాడు బుద్ధప్రసాద్‌గారు. తాను మంత్రిగా ఉన్నప్పటి ఓ సంఘటనను గుర్తు చేశారు. "లండన్ వెళ్ళినప్పుడు ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ సమాధిని దర్శించాం. అది ఏ ప్రాధాన్యతా లేకుండా శిథిలావస్థలో ఉంది. బ్రౌన్‌గారు మనకు చేసిన సేవలు అక్కడి ప్రజలకు తెలియవు. తెలిసిన మనలో కృతజ్ఞత చూపగలిగే మానవత్వం ఉండాలి. అందుకే మంత్రిగా నాకున్న వనరుల సాయంతో బ్రౌన్‌గారి సమాధిని మంచి మెమోరియల్‌గా, ఒక ఆకర్షణీయమైన పెద్ద నిర్మాణంగా కట్టించగలిగిన తృప్తి మిగిలింది" అన్నారు.

ఒక రాజకీయ నాయకుడైనప్పటికీ ప్రసాద్ చరిత్రను అధ్యయనం చేయడమే గాక, గొప్ప సత్యాలను విస్పష్టంగా నేటి సమాజానికి గుర్తు చేశారు. డబ్బు కోసమే పదవులను ఉపయోగించుకునే ఈ రోజుల్లో ప్రజలు మరచిన ఓ మహనీయుని సేవలకు కృతజ్ఞతగా తనకు అవకాశాన్ని ఉపయోగించిన ఇటువంటి నాయకులు మిగిలినవారికి స్ఫూర్తిదాతలు!

ఈ స్ఫూర్తిని కవులు, రచయితలు అందుకుని చరిత్రను అధ్యయనం చేసి సత్యాలను ప్రకటించాలి. అసత్యాలపై అక్షర పోరాటం చేయాలి.

"కవిత్వానికి మనుషుల్ని అటో ఇటో
మళ్ళించే శక్తి ఉందని నేను నమ్ముతాను
నిజాన్ని తెలుసుకోవడం, మంచి చెడ్డల
నిర్ణయించుకోవడం, మనుషుల్ని
మంచికి మళ్ళించడానికి ప్రయ
త్నించడం - రచయితల కర్తవ్యం అని
నేననుకొంటున్నాను."

దాదాపు అర్ధ శతాబ్దం కిందే రావిశాస్త్రి ఈ మాటలు కవుల, రచయితల కర్తవ్యాన్ని స్పష్టం చేస్తున్నాయి. నిజాలను తెలుసుకోవడం మంచి చెడ్డలు నిర్ణయించడం, మనుషుల్ని మంచివైపు మళ్ళించడం - మూడు ముఖ్యమైన కర్తవ్యాలు - ఎంత ఉదాత్తమైన బాధ్యత!

మానవీయ విలువలను హృదయాలలో విత్తే సాహిత్యాన్ని మన రచయితలు ఎందుకు సృష్టించడం లేదు అని ప్రశ్నించుకోవాలి. అసమానతలు దేశప్రగతికి నిరోధకాలు తెలిసి కూడా రచయితలు వాటి నిర్మూలనకు తమ రచనల ద్వారా పూనుకోకపోవడం వల్లనే కదూ... కులం నేడు ముప్పై సంఘాలుగా అరవై ముఠాలుగా విభజన మంత్రాన్ని పఠిస్తున్నది.

విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని చాటవలసిన రచయితలు సంకుచిత ఏర్పాటు భావాలకు కేంద్రాలుగా మారడం భారత సాహితీ చరిత్రలో విషాదఘట్టం!

అందుకే శ్రీశ్రీ ఏనాడో దుఃఖించాడు. "కొందరు ప్రతిభావంతులైన కవులు అభివృద్ధి నిరోధకులు" అని.

కుల మత వర్గ భాష ప్రాంతాల భేదభావాలు స్వార్థపరులు, పదవీలోలురైన రాజకీయ నాయకులకుండవచ్చునేమో గానీ కవులు, రచయిత్రులకు ఉండరాదు. ఉంటే... ఉగ్ర, అగ్ర తీవ్రవాద హింసోన్మాదులకు, మనకు తేడా ఉంటుందా? మనుషుల మధ్య గోడలను కూల్చివేసి, ఐక్యతారాగంతో విశ్వమానవ ప్రేమను శ్రుతి చేయవలసిన బాధ్యత మనపైన ఉన్నది కదా!

**మానవీయ విలువలను హృదయాలలో విత్తే సాహిత్యాన్ని మన రచయితలు ఎందుకు సృష్టించడం లేదు అని ప్రశ్నించుకోవాలి. అసమానతలు దేశప్రగతికి నిరోధకాలు తెలిసి కూడా రచయితలు వాటి నిర్మూలనకు తమ రచనల ద్వారా పూనుకోకపోవడం వల్లనే కదూ... కులం నేడు ముప్ఫై సంఘాలుగా అరవై ముఠాలుగా విభజన మంత్రాన్ని పఠిస్తున్నది.**

"నీవు నేను వేరు వేరని
ఎవడు కట్టిన గోడరా
గోడలన్నీ కూల్చివేసి
మమత వంతెన కట్టరా"

("ఏడు రంగులు ఏకమై" గేయం స్వీయం) 1909లోనే గురజాడ అప్పారావు ఒక కలకన్నారు :

"యెల్లోలోకము వొక్క యిల్లై
వర్ణభేదము లెల్ల కల్లై
మనసులొకటై మనుషులుండాలని" ఆ కల! ఈ వంద సంవత్సరాల్లో కవి కల నెరవేరలేదంటే ఆ అడుగు జాడలలో తర్వాత కవులు అడుగేయకపోవడమే కారణం! ఇది ఆత్మపరిశీలన చేసుకోవలసిన తరుణం.

"అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్"

భారతీయ సాహిత్యంలో ఇటువంటి సందేశాలు విరివిగా వచ్చి ఉంటే కుల పిశాచిని ఈ నేల నుండి ఏనాడో తుడిచిపెట్టేవాళ్ళం.

"మా కొద్దీ తెల్లదొరతనము" అని ఎలుగెత్తిన గరిమెళ్ళ "మా కొద్దీ కులపెత్తనం" అని కూడా గట్టిగా ప్రతిధ్వనించాల్సింది. ఆంగ్ల కవి, విమర్శకుడు ఫిలిప్ సిడ్నీ. "ప్రపంచానికి జ్ఞానకిరణం కవిత్వమే" అన్నాడు. సమాజం పుస్తకాలను చదివేది జ్ఞానం కోసమే! వీరేశలింగం పంతులు త్రిపురనేని రామస్వామి చౌదరి వంటి కవులు సత్యాన్ని సూటిగా ప్రకటించి, మానవాభ్యుదయానికి అవరోధంగా ఉన్న కులం మీద చేసిన దాడికి నేటి కవులు, రచయితల్లో వారసులు లేకపోవడం విషాదం.

అనిశెట్టి సుబ్బారావు ప్రజలను రెండు తెగలుగా విభజించారు. గతమనే ఊబిలో కూరుకుపోయి, ప్రస్తుతపు అమానుషాన్ని సహించే, సమర్థించే మూఢులు, స్వార్థపరులూ ఒక తెగ అయితే, ప్రస్తుతంలోని రాక్షసాన్ని గ్రహించి, హృదయం కంపించి, ప్రస్తుతాన్ని బద్దలు కొట్టి, మహత్తర భావిని నిర్మించేందుకు పిడికిలి ఎత్తి ప్రతిజ్ఞబూనే పురోగాములు రెండవ తరం. నేటి బాలలే రేపటి పౌరులంటాం. ఈ రెండవ తెగలా రేపటి పౌరులు రూపొందాలంటూ తన పద్యంలో కాంక్షించారు.

"భవిష్యత్తు నూరించే వెలుగు పోచలా మీరు
సంఘపు కుంపటి వెల్గించే సెయింట్ జోన్‌లెంతమంది
జీవశాంతి రసార్ద్రులౌ జీసస్ లెందరో"

మీలో ఇటువంటి పద్యాలను విన్న నాటి సమాజం వెలుగు పోచలుగా, సెయింట్ జోన్‌లుగా, శాంతి పిత జీసస్‌లుగా రూపొందాలని కోరుకున్నారు గనుకనే నాడు రెండవ తెగలో వారే ఎక్కువమంది ఉన్నారు. నేడు ఆ మొదటి తెగ సంఖ్య పెరిగిపోతున్నది అన్న దానికి జరుగుతున్న సంఘటనలే సాక్ష్యం.

ప్రేమించి పెళ్ళి చేసుకుందామనుకునే జంట వేర్వేరు కులాల వాళ్ళయితే పెద్దలు వాళ్ళ వివాహాన్ని అంగీకరించరు సరికదా... వాళ్ళను చంపడానికి వెనుకాడరు లేక ఆత్మహత్యలకు వాళ్ళను ప్రేరేపిస్తారు. కాలేజీ లెక్చరర్లు 'అస్మదీయులకు' మంచి మార్కులు వేసి, టాపర్లను చేస్తారు. 'తస్మదీయులను' ఫెయిల్ చేసి, సంఘ వ్యతిరేక శక్తులుగా మార్చుతారు.

ఇక కార్యాలయాల్లో అధికారులు 'తమ వారికి' మంచి సీట్లు, ప్రమోషన్లు కట్టబెట్టి, మిగిలిన వాళ్ళను అవకాశాలకు దూరంగా అణచివేస్తూనే ఉంటారు. రాజకీయ పార్టీలను గురించి ఎంత చెప్పుకున్నా తక్కువే! గ్రామాల నుండి రాజధాని వరకు స్వర్ణ కిరీటాలన్నీ 'తమవారికే'! ముళ్ళ కిరీటాలు మాత్రం తస్మదీయులకు.

ఈ సందర్భంలో ఇక్కడ భాష గురించి ఖచ్చితంగా మాట్లాడుకోవాలి. భారత రాజ్యాంగం 'భారతీయులంతా సమానులే' అని ప్రకటిస్తుండగా పౌరులను అవమానించే భాష, పదాలు వాడటం ఎంత క్రూరత్వం!

"ఆటవిక రాజ్యంలో
క్రూర జంతువులు సాధుజీవులు
ప్రకృతి సహజం
మానవ సమాజంలో
అగ్ర అధమ పదాలు
వికృత రాతల నికృష్ట కల్పనలు!"

('తీర్పు' కవిత - స్వీయం)

'అణగారిన' వర్గాలు అంటారు. ఎవరు? ఎందుకు?

అణగదొక్కబడ్డారే గానీ, అణచివేయబడ్డారే గానీ వాళ్ళంతట వాళ్ళు 'అణగారలేదు'. 'అవర్ణ' - ఏమిటీ అవర్ణ మిగిలిన వాళ్ళలా రంగు, రూపుతేడా? "నీచ నిమ్న, బడుగు, బలహీన, అబ, ఆడది" - ఆలోచించే వాళ్ళు ఈ దేశంలో లేరా? నేను 'కాలమ్' రాసే రోజుల్లో ఈ పదాలను నిషేధించాలన్నప్పుడు చాలామంది సంతోషిస్తూ అభినందించారు. కానీ, పత్రికలు గానీ, వ్యక్తులు గానీ, నిరాటంకంగా వాడుతూనే ఉన్నారు. 'హరిజనులు' పదాన్ని అంబేద్కర్ వాడవద్దని పిలుపునిచ్చారు. మిగిలిన పదాల గురించి వారికి తెలియదేమో! విజయవాడలో జరుగుతున్న '2011 ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు' ఒక తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించాలని కోరుతున్నాం. "పంచములు, అంటరానివాళ్ళు, అగ్ర, అధమ, అవర్ణ, సవర్ణ, ఉచ్చ, నీచ్చ, అధమ, నిమ్న, అస్పృశ్య, అణగారిన, అబల, ఆడది, వాడది, మీరేమిట్లు వంటివే కాక - ప్రజలను అవమానించే మారే పదాలైనా భాషలో నుండి నిషేధించాలి!

'భారతదేశం నా మాతృభూమి భారతీయులందరు నా సహోదరులు అని పాఠశాలల్లో ప్రతిజ్ఞ చేస్తే బాలలు పై పదాల అర్థం ఏమని చెప్తారు?

భారతదేశ సంస్కర్తలు నాటి రచయితలు ఆశించిన నవ సమాజ నిర్మాణం జరగాలంటే కులాన్ని, దానికి సంబంధించిన అమానవీయమైన పదజాలాన్ని తక్షణమే నిర్మూలించాలి. అప్పుడే మన సమాజానికి పునరుజ్జీవం ఆవిష్కారమవుతుంది. సాహిత్యమే దానిని సాధ్యం చేయాలి. దేశంలో ఏ రాష్ట్రం వారైనా, ఏ ప్రాంత వారైనా

**ఈ సందర్భంలో ఇక్కడ భాష గురించి ఖచ్చితంగా మాట్లాడుకోవాలి. భారత రాజ్యాంగం 'భారతీయులంతా సమానులే' అని ప్రకటిస్తుండగా పౌరులను అవమానించే భాష, పదాలు వాడటం ఎంత క్రూరత్వం!**

కులాలుగా, మతాలుగా గాక, భారతీయులుగా గుర్తింపబడాలి. నేటి, రేపటి మానవుని ఆత్మగౌరవంతో బ్రతికే నవోదయం కోసం కవులు, రచయితలు తమ కులాలతో సంబంధం లేకుండా కలాలు కలపాలి ముందుగా కలాలు కులాల నుండి విముక్తం కావాలి.

రచయితలు సమావేశాలు, కవి సమ్మేళనాలు షాలువాలు కప్పుకోని, చప్పట్లు కట్టుకొని, పరస్పరం కీర్తికిరీటాలు ధరింప చేసుకుని, ఆనందతాండవంలో మునిగిపోవడానికి కాదు. మిగిలినవారందరూ పనులకు, ఉద్యోగాలకు కాలపరిమితి ఉంది గాని, కవులకు రచనా వ్యాసం గానికి పరమితి లేదు... విశ్రాంతి లేదు.

"ద్వేషంతో, రోషంతో, మోసంతో, నీరసంతో, అశాంతితో, అంధకారాలతో దేశం భయంకరంగా ఉంది. దృష్ట, విశ్వాసి అయిన కవి మౌనంగా ఉండవచ్చునా? నవ్య సాహిత్య పరిషత్తు మౌనంగా ఉండవచ్చును. 1942లో కృష్ణశాస్త్రి వేసిన ప్రశ్న నేడు మనందరికీ వేస్తున్నాడు - నాటికీ నేటికీ పరిస్థితుల్లో తేడా లేదు.

నాటి ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ 'అరసం' వారికి పంపిన సందేశంలో

"సమస్త మానవుల అభ్యుదయం కోసం సమ సమాజ స్థాపన కోసం అభ్యుదయ రచయితలు తమ రచనల ద్వారా పాటుపడాలి." అని ఆకాంక్షించారు.

గత సంవత్సరం జ్ఞానపీఠ్ అవార్డు నందిస్తూ లోక్‌సభ స్పీకరు శ్రీమతి మీరాకుమారి "కులరహిత భారత సమాజ నిర్మాణానికి భారత కవులు, రచయితలు అంకితమివ్వాలని" పిలుపునిచ్చారు.

ఆ మధ్య సౌదా రాసిన 'బర్బరీకుడు' కథలో వేటగాడు కృష్ణునికి బాణంతో కొడతాడు కృష్ణుడు అడుగుతాడు "నేనని తెలిసే బాణం వేశావా?" అని. తెలియక వేశానయ్యా" అంటాడతను.

"మరి.. తెలిసి వేసేదెప్పుడు?" అని కృష్ణుడు కన్నుమూశాడు. ఇది కథ.

ఓ రచయిత తోటి రచయితలను సూటిగా అడుగుతున్న ప్రశ్న :

"భారతీయ సమాజ పునాదుల కుట్ర తెలిసింది... తెలిసి, బాణం వేసేదెప్పుడు ఇది ఒక పాఠం :!

సత్యాన్ని విస్పష్టంగా ప్రకటించలేని సాహిత్య ఉత్పత్తి ఏ ప్రయోజనాన్నిస్తుంది! 21వ శతాబ్దంలో కూడా నిరాటంకంగా జరిగిపోతున్న దుష్టత్వాలు, దౌర్జన్యాలు, కుట్రలు, కుతంత్రాలు, మానవ హనన దానవ కాండకు కారణాలు, అసమానతలకు మూలమైన ఉగ్ర అగ్ర తీవ్రవాద హింసోన్మాదాలే. వీటిని బట్టబయలు చేసి సామాన్య ప్రజల్లో చైతన్యాన్నీ - ఆత్మస్థైర్యాన్నీ నింపే రచనలను చీకటిలో దారిచూపే దీపస్థంభాల్లాగా కవులు, రచయితలు అందివ్వాలి.

యేసుక్రీస్తు అంటారు :

"రోగికే గానీ ఆరోగ్యవంతుడికి
వైద్యుని అవసరం లేదు" అని.

భారత సమాజం ఇంకా వ్యాధిగ్రస్తంగానే ఉందన్న సంగతి మన కవులకు తెలుసు. ప్రముఖ హిందీ రచయిత ప్రేమ్‌చంద్ మాటలు మన కవులు, రచయితలకు మార్గదర్శకం కావాలి.

"వైద్యుడి పాత్రని రచయిత వహించాలి. సాహిత్యం సౌందర్యాన్ని సృష్టిస్తుంది. విశ్వాసం, సత్యాన్ని, సానుభూతిని, న్యాయ ప్రియత్వం, మమతను, మానవత్వాన్ని నింపుతుంది. అది సౌందర్యం! ఇది ఉన్నచోటే దృఢత్వం... నిజమైన జీవితం! లేనిచోట శతృత్వం, ఈర్ష్య, ద్వేషం తుదకు మృత్యువు... ప్రగతిశీలత్వం లేనివాడు సాహితీకారుడు కానేకాదు. బానిస భావాల నుండి, పేదరికం నుండి భారతజాతి విముక్తి పొందాలనే వేదన సాహితీకారుడు ఎంత వ్యాకులతతో అనుభవిస్తాడో అంత వాస్తవికత వెలుగు నింపుకొంటుంది. అతని రచనలో చెడును సహించలేనినాడే దాని నిర్మూలనకు నడుం బిగిస్తాం. ప్రపంచ సాహిత్య సభల్లో శాస్త్రీయ సామాజిక చారిత్రక విజ్ఞాన రంగాలపై లోతుగా అధ్యయనం చేస్తారు. లోటుపాట్లను సవరించు కుంటారు. 'సేవే జీవితాదర్శంగా కష్టాల అనుభూతులు గుండెలో పొదుపుకున్నవారూ, ప్రేమావేశంగల ఆరాధకులూ ఉదాత్త సాహిత్యాన్ని నిర్మించగలరు. ఉన్నత భావాలు, స్వతంత్ర ఆలోచనలే గొప్ప సాహిత్యాన్ని సృష్టించగలవు'' అన్నారు ప్రేమ్‌చంద్. ''బుద్ధుడు, క్రీస్తు, మహ్మద్‌లాంటివారు నీతి పునాదుల మీద సమతా నిలయాన్ని నిర్మించాలని కృషి చేశారని ప్రేమ్‌చంద్ రాస్తే "బుద్ధుడు, ఏసుక్రీస్తు, సోక్రటీస్ విశ్వాన్నంతా చైతన్యమయ జీవనోద్యమంగా మార్చే ప్రేమను పాదుకొల్పే ప్రయత్నం చేశారని అనిశెట్టి అన్నారు.

సమస్యల చీకట్లలో సగటు మనిషి చిక్కుకుని, దారి చూపే దీపస్థంభం కోసం వెతుకుతుంటే సాహితీ దీపాలతో వెలుగు పంచవలసిన నాటి కవులు అవేమీ పట్టించుకోకుండా ఊహా ప్రేయసి అంగాంగ వర్ణనలు శృంగార మత్తులో మునిగి తేలుతుంటే శ్రీశ్రీ ఓ మహా గర్జనతో తన నిరసనను తెలిపాడు.

"ఎముకలు కుళ్ళిన వయసు మళ్ళిన
సోమరులారా చావండి...
ప్రపంచం ఎట్లా పోతేనేం?
మీకెందుకులెండి..."

నేనైతే... నేటి కవులు, రచయితలైన సోదర సోదరీమణులకు ఓ విజ్ఞప్తి చేస్తూ ఈ వ్యాసాన్ని ముగిస్తున్నాను...నాడు రవీంద్రనాథ్ ఠాగూర్ 'గీతాంజలి'లో చేసిన ప్రార్థనే నా కవులకు విన్నపం :"ఎక్కడ మనసు నిర్భయంగా ఉంటుంది

ఎక్కడ మనిషి సగర్వంగా తలెత్తుకు తిరగగలడో
ఎక్కడ విజ్ఞానం స్వేచ్ఛగా మనగలుగుతుందో
ఎక్కడ ప్రపంచం ముక్క ముక్కలై
ఇరుకైన గోడల మధ్య మగ్గిపోతూ
తలపులో పనిలో నిత్య విశాల పథాలమై
ఎక్కడ మనసు పయనిస్తుందో... ఆ స్వేచ్ఛ
స్వర్గంలోకి, తండ్రీ,
నా దేశం మేల్కొనేలా అనుగ్రహించు!!

**(విజయవాడలో జరిగిన ప్రపంచ తెలుగు సభల్లో చదివిన ప్రసంగం)**

2008- అక్టోబర్ & నవంబర్ ప్రస్థానం ప్రత్యేక సంచికలో డా॥ లెనిన్ ధనిశెట్టి రాసిన మోటార్ సైకిల్ డైరీ "జర్నీ విత్ ఐరన్ వోర్"ను 'కథ కానిది' పేరిట ప్రచురించాం. దీనికి పాలగుమ్మి సాయినాథ్ ట్రస్ట్ 'అవార్డు'ను కూడా ప్రకటించింది. ఓబులాపురం గనుల నుండి ఇనుప ఖనిజాన్ని తవ్వి లారీలలో తీసుకుపోతున్న పరిస్థితులను శక్తివంతంగా ఈ కథనం చిత్రించింది. వర్తమాన పరిణామాల నేపథ్యంలో దీన్ని పునర్ముద్రిస్తున్నాం.

# మోటార్ సైకిల్ డైరీ
# 'జర్నీ విత్ ఐరన్ వోర్'



కథ కానిది

- డాక్టర్ లెనిన్ ధనిశెట్టి

యథాలాపంగా... అప్పుడప్పుడూ.. టీ అంగళ్ళ ముందు చెల్లాచెదురుగా నలిగిపోయి, అట్లా గాలికి పడుతూ.. లేస్తూ.. 'టీ' మరకలతో మాసిపోయిన దినపత్రికల జిల్లా స్పెషళ్ళ అంచుల నుంచి కారుతున్న రక్తపు బొట్లు.. వొక్కొటొక్కోటిగా.. బొట్టూ... బొట్టూ.... మడుగులు కడుతున్న దృశ్యం.... కళ్ళూ... వొళ్ళూ... గిగ్రున తిప్పేలా ఎర్రటి నెత్తురి నీచువాసన. కాంట్రాక్టర్లు, అధికారులు, రాజకీయ నాయకులు పెనవేసుకొని అనంతపురం, నెల్లూరు, కడప జిల్లాల రోడ్ల మీద నెత్తురు పారిస్తున్నారు.

'నెత్తురోడుతున్న నెల్లూరు రోడ్లు' '100 రోజులూ -18 ప్రాణాలు', 'గాలిలో ప్రాణం - ధూళిలో జెనం', 'ప్రమాదంపై ప్రజాగ్రహం', 'లారీ ఢీ 12 మంది మృతి' యిట్లాంటి వార్తలు పతాక శీర్షికలనిండా గత తొమ్మిది నెలలుగా... ప్రతిరోజూ.. వొక్కోచోట.. వొక్కో మానవప్రాణం' గాల్లో కలుస్తూ.. మనసులో ప్రమాదాల పచ్చి నెత్తుటి తడి అరకముందే నెల్లూరి నించి ముడి ఖనిజపు ఎగుమతి వ్యతిరేక కమిటీ కన్వీనర్ కిషోర్‌బాబు ఫోన్... ఈ విధ్వంసపు మూలాలు వెళ్ళి చూడమనీ.. అట్లా ప్రారంభమయ్యింది. నా... Journey with Iron (WH)ore.

గత 9 నెలలుగా.... ఓబులాపురం గనుల్లో తవ్వితీసే ముడి ఇనుము (ఐరన్‌వోర్)ను వేలాది లారీల్లో కృష్ణపట్నం పోర్టుకు నిత్యమూ తరలిస్తున్నారు, విదేశాలకు ఎగుమతి కోసం. ఈ వేలాది లారీలు అనంతపురంలోని ఓబులాపురం నుంచి ప్రయాణించి కడప జిల్లా మీదుగా నెల్లూరు జిల్లాలోని మర్రిపాడులో ప్రవేశించి జిల్లాలో మొత్తం 136 కిలోమీటర్లు ప్రయాణించి కృష్ణపట్నం పోర్టుకు చేరుతాయి. మరోవైపు నెల్లూరుజిల్లా నుంచి వెంకటాచలం రైల్వేస్టేషన్‌కు వ్యాగన్లలో వచ్చే ఐరన్‌వోర్ అక్కణ్ణుంచి లారీల ద్వారా 25 కిలోమీటర్లు ప్రయాణించి కృష్ణపట్నం పోర్టుకు చేరుతాయి. ఈ రెండు మార్గాల్లో మొత్తం 45

గ్రామాలు మీదుగా ఐరన్‌వోర్ లారీల ప్రయాణపు రాకపోకలుంటాయి. మొత్తం మర్రిపాడు, వెంకటాచలం, కృష్ణపట్నం మధ్య జరిగే ట్రయాంగిల్ ఛేజింగ్ స్టోరీ'లో గ్రామాల్లో, సెంటర్లలో రోజూ నలభైవొకటీ – రెండు వేలమంది రోడ్లను అటూ ఇటూ దాటుతుంటారు రోజూ. ఇక రోడ్డు ప్రక్కనే జీవించే కుటుంబాల్లోని సభ్యుల్ని లెక్కవేస్తే... ఆ సంఖ్య లక్షల్లోనే వుంటుంది. తొమ్మిది నెలల క్రితం ప్రశాంతంగా వుండే నెల్లూరుజిల్లా పచ్చటి గ్రామసీమల్ని యముడి దున్నపోతుల్లా ముట్టడించాయి ఐరన్ వోర్ లారీలు. అడ్డొచ్చిన మనుషుల్ని బర్రెల్నీ, గొర్రెల్నీ, వాహ నాలను నుజ్జు నుజ్జు చేస్తూ... విపరీతమైన శబ్దాలతో పొద వుగా... పధ్నాలుగు టైర్ల పొదవు, టిప్పర్లు రాత్రింబవళ్ళూ జనాలకు కునుకు లేకుండా చేస్తూ.. పచ్చటి గ్రామాల ముఖాలకు ఎర్రటి ఐరన్‌వోర్ పౌడరును పులుముతూ ... Though God Dies…. Still SATAN…..

......

యింత విధ్వంసమూ...

ఎలక్ట్రానిక్, ప్రింట్ మీడియాకి 'సరిగ్గా' కన్పించలేదు. ప్రజల చావులూ, నెత్తురూ మాత్రమే మీడియాను కదిలించి, కరుణించింది. అవి కూడా జిల్లా ప్రత్యేకాల్లోనే... మెయిన్ పేజీలకెక్కేందుకు ఇంకెంత మంది చావాలో? వెళ్ళాలో... వందలాది మంది విశేషంగా ఆర్టీసీ మెఫసిల్ బస్ సర్వీస్, కూరగాయలు, ఎండుచేపల చెమట కమురు, కంపులో విరామం లేకుండా చర్చించుకొంటున్న విధ్వంసం వింతల్ని... విశేషాల్ని ఈ ముప్ఫై ఐదేళ్ళ శరీరపు కళ్ళతో చూడాలి. చెవుల్తో వినాలి... చూడాలి... రాయాలి... నాకు మాత్రమే తెలిసిన అన్‌రెస్ట్ వెంటాడుతోంది నన్ను రేయింబవళ్ళు నిర్విరామంగా...

**23 ఏప్రిల్ 2008**

**బుధవారం**

తెల్లవారుజామున నాలుగు గంటలకు ఓ పాత బజాజ్ సిటి హండ్రెడ్ బైక్ మీద నేనూ, రైతు కూలి సంఘం జిల్లా సభ్యుడు కృష్ణారెడ్డి నెల్లూరి నుంచి బయల్దేరాం. మర్రిపాడు వైపు..వెనకా ముందూ.. వందలాది ఐరన్‌వోర్ లారీల మధ్య సభ్యుల ఉయ్యాల ఊగుతూ.. విన్యాసాలు చేస్తూ... ఎనభై కిలోమీటర్ల వేగంతో బైక్ తోలుతున్న యాభైఏళ్ళ కృష్ణారెడ్డి... వెనుక నేనూ... నా చేతిలో గాలికి ఫెళఫెళలాడుతున్న ప్లాస్టిక్ కవర్లో నిద్ర పోతున్న ఓ చైనా డిజిటల్ వీడియో కెమెరా... దానికి తోడుగా ఎగ్జిక్యూటివ్ డైరీ..

MOTOR CYCLE DIARY… get ready for rush hour…..

...

ఉషస్సు పత్తికాయలా విచ్చి పోతున్న తొలి వెలుగు వేళలో... నల్లటి రాజ్యపు రోడ్డుపై ఎర్రటి నెత్తుటి లేసులల్లిన బర్రెల శవాలు.. వొకటీ... రెండూ .. మొత్తం నాలుగు.. ఆ వైపు రోడ్డుకు అడ్డు తిరిగిన ఐరన్ వోర్ లారీ, రాత్రి తాగిన తమకంలోనా? ఫ్రెష్ యాక్సిడెంట్...రోడ్డు కపతల పొదల్లో కొమ్ము విరిగి నెత్తురోడుతూ బిత్తర చూపుల భయం కళ్ళతో చిన్నిదూడ... పక్కనే దువ్వూరికి చెందిన అన్నమ్మ ఏడుపు లారీకి ఆవైపు. వుండే నాలుగు బర్రెల్ని ఈ లారీలు మింగేసినాయి. అన్నీ నాశనమై పోయాయి. అంటో నోట్లో చీరగుడ్డ కుక్కుకొని ఎక్కిళ్ళు పెడుతో... ఏడుస్తో... దగ్గర దగ్గర బుచ్చిరెడ్డి పాళానికి దగ్గర్లో...

అన్నమ్మను వోదార్చే ధైర్యం లేకపోయింది నాకూ... కృష్ణారెడ్డికి. నెల్లూరు నుంచి మర్రిపాడు దాకా నడుములూ, మెడలు తెగిపోయిన లారీలు, ఆటోలు, ట్రక్కులూ, నుజ్జు నుజ్జయి పోయి రెండుగా విడిపోయి, రోడ్డుదిగేసిన ఐరన్‌వోర్ లారీలు, రోడ్ల నిండా, ఆయిల్ మరకలూ, పొలుకులు పొలుకులైన లారీ అద్దాల గాజు ముక్కల వజ్రాలూ,"తూగాను సార్ ఇలా గయ్యిందని" చెప్పాడో డ్రైవర్ తిరగబడిన తన లారీని చూపిస్తూ.. వోటిష్టపకారం బోతుండాయి లారీలు, రోజుకు నలుగురూ ముగ్గురూ పోతుండారు. పైకి.. రోడ్డు దాటాలంటే కనాకష్టంగా వుంది యాడబడతా? ఎవురికి జెపతా అంటూ బుసకొట్టాడు నెల్లూరిపల్లి సెంటర్లో కిష్టయ్య. గుద్ది ఆపకుండా ఎల్లిపోయాడు సార్ ఐరన్‌లారీవోడు. పుల్లు రఫ్ డ్రైవింగ్ నిద్రబోతా గూడా బండ్లు తోలతుండారు సార్. చెయ్యికి గూడా దెబ్బతగిలింది. వాళ్ళిష్టమైపోయింది సార్ అంటూ యాక్సిడెంట్ అయిన తన ట్రక్కును చూపించాడు డ్రైవర్ సత్యనారాయణ.

.....

మర్రిపాడు సెంటర్‌లో మనుషులకంటే టిఫెన్ తినేదానికి ఆగిన ఐరన్‌వోర్ లారీలే ఎక్కువున్నాయి. నెల్లూరినించి కడపకు మామూలుగా నాలుగు గంటల జర్నీ, ఈ లారీలోళ్ళ మూలంగా ఆరుగంటలు పడుతోంది. బయలు దేరింది మొదలు ఇంటికి పోతామో లేదో అని భయంగా వుంది సార్. ట్రిప్పులు కలుపుకోవాలని క్లీనర్ల చేత కూడా తోలిస్తా వుంటారు. ఎక్కడ జూసినా ట్రాఫిక్‌జామ్. ఎక్కడబడితే అక్కడ దూరతారు. రెండువేల లారీలు తిరుగు తుండాయి సార్... రోడ్డు గుంటలబడి పోయింది. డే అండ్ నైట్ తోలటం. కంటిన్యూగా తిరగతా వుంటాయి. హెడ్‌లైట్లు కూడా ఆపరు నా కొడుకులు. హెవీ లోడు... టన్నేజ్ ఎక్కువ. మా సర్వీసుల్లో యింత ట్రాఫిక్కూ ఇన్ని యాక్సిడెంట్లూ చూళ్ళా అంటూ యాష్ట పోయారు ఆర్టీసీ డ్రైవరు మోహన్‌రావు కండక్టర్లు అశ్వంతరెడ్డి, వెంకటేశ్వర్లు...

....

యాడజూసినా గుద్దుకోవడమే గదా? పొయ్యేదానికి మాకు దారిగూడా వదలడంలా లారిలోళ్ళు, ఇరవై వేలు బెట్టి బండిగొని బస్సులో తిరగతుండా ఈ లారీలకు భయపడి. సీరియస్‌గా చెప్పేడు మర్రిపాడులో తలపని చేస్తున్న వెంకటస్వామి. ఆటోల్లో పోవాలన్నా భయమేస్తుంది. బళ్ళుపైకి విసరతుండారని చెప్పేడు హజరత్. ఇంతకు ముందు ఫ్రీగా నడచి పోతున్నాము. పిలకాయల్ని రోడ్డు మీదకు పంపాలన్నా భయంగా

వుంది. ఇరవైనాలుగ్గంటలూ... పగలని రాత్రని లేదు. లారీలు పోతూనే వుంటాయి. మార్జిను దిగరు... అనవసరంగా ఈ మధ్య పదమూడుమంది పెళ్ళోళ్ళు చచ్చిపోయారు. ఎవరికి చెప్పుకోవాలి అంటూ ప్రశ్నించాడు హరికృష్ణ. ఈ దుమ్ము మూలంగా జబ్బులొస్తుండాయి. లారీల దెబ్బకి ఏ టైంలో ఏం జరుగుద్దో అని తెలీకుండా వుందని, నిదానంగా గంటకోమాట చెప్పాడు ఇసుకపల్లి వెంకటేశ్వర్లు. లైసెన్స్ లేనోళ్ళూ, చిన్న పిలకాయలు, తాగుబోతులూ లారీ లెక్కితోలతా వుండారు, టూవీలర్లు, ఫోర్‌వీలర్ల వోళ్ళూ రోడ్డెక్కాలంటే భయపడిపోతుండారు. జనాల్ని, గొడ్డూ గోదాను గుద్దిపారేసి వాళ్ళమానాన వాళ్ళు బోతావుండారని మౌనం వహించాడు వెంగయ్య... ది విలేజ్ లీడర్ ఆఫ్ సిపియం.

కూలీలు బోతుండాయి సార్... చెనగ.. మిరపకాయల కూలోళ్ళు ఆటో లెక్కితే సస్తామని కూలీలకు గూడా బోకుండా ఇళ్ళకాడ పడుండారని చెబుతూ సిపిఎం కార్యకర్త మర్రిపాడు ఎరుకలయ్య స్పీడ్ బ్రేకర్లు కూడా ఎంత జెప్పిన వేయడం లేదని అధికార్లను విమర్శించాడు.



రోడ్లమీదకే రాబళ్ళా. స్పీడు బ్రేకర్ల మీదనే అరవైలో దూకిస్తావుండారు లారీలోళ్ళు. నందవరం నుంచి మర్రిపాడు దాకా డైలీ యాక్సిడెంట్లే. ఇంతకు ముందు అరగంటకో లారీ వచ్చేది. ఇప్పుడు నిమిషానికి ఇరవై లారీలు వస్తావుండాలని ధాటీగా చెప్పేడు నందవరానికి చెందిన రైతు తిరుపతయ్య. నందవరం సెంటర్లోనే డి.సి.పల్లె ఫీల్డ్ అసిస్టెంట్ వచ్చే పోయ్యే ఐరన్‌వోర్ లారీలను చూస్తూ అతికష్టం మీద చెప్పాడు.. చాలా టెన్షన్‌గా వుంది సార్ రోడ్డెక్కాలంటే అని. నా గొర్రెలు రొండిటిన్ని దొక్కించినాయి నాయినా ఇనుప మట్టి లారీలు, మావసం గూడా పనికిరాలా రోడ్డుమీదే పారేశా... గొర్రెల్ని రోడ్డువతలకు దోలితే ఒట్టు. పైసా గట్లా లారీలోళ్ళు. కేసుగూడా లాన అంటూ కన్నీరు పెట్టింది నందవరంలో మస్తానమ్మ. గొల్లోళ్ళ గొర్రెల్ని అన్నీ లారీలు తొక్కేసినాయిసార్.. లారీలు ఇట్లా వుంటే పిలకాయల్ని స్కూలు కూడా పంపించి చంపుకొనేదానికంటే స్కూలు మానేయడమే మంచిదన్నాడు. 'గిరిజన కాలనీకి చెందిన శ్రీను. రావాలన్నా, పోవాలన్నా భయమేస్తావుంది. ఒకదానికి ఒకటి పోటీలు పడి దమదమబోతావుంటే ఏం జెయ్యాలి? అంటూ గుండెలమీద చేతులుంచి చెప్పింది రాగమ్మ. ఏం జేస్తాం సార్. లారీలకు భయపడి పాసింజర్లు ఆటోలో ఎక్కడం లేదు.. సాయంత్రం ఐదున్నరకే మేము ఆటోలు ఆపేస్తున్నమని చెప్పాడో ఆటోడ్రైవర్ నందవరం సెంటర్‌లో... అక్కడే చెక్‌పోస్ట్ సెక్యూరిటీ గార్డు రామస్వామి మాట్లాడుతూ సార్ మా చెక్‌పోస్ట్ కర్రను కూడా కొట్టేశాయి సార్ అడిగితే రౌడీయిజం చేస్తున్నారని ఆవేదన పడ్డాడు.

.....

బర్రెల్ని గొట్టేసి పోతుందరు. ఏం బండైందీ కనుక్కొలేక పోతిమి. వరసగా వందలబండ్లు బోతావుంటే ఏ బండి నడగతాం. ఈ లారీల వల్ల అన్నిటికీ ఇబ్బందయిపోయిందన్నాడు పి.సి. పల్లెలో రైతు శేషురెడ్డి. రోజుకు ఐదారు యాక్సిడెంట్లు. రోజూ గంటలు గంటలు ట్రాఫిక్ జామ్‌లు. ఇక్కణ్ణుంచి మామూలుగా నెల్లూరికి ఒకటిన్నరగంట జర్నీ ఇప్పుడు మూడు గంటలు బడుతుంది. అంతా ఈ లారీలవల్లే అంటూ శాసనార్థాలు పెట్టేడు డి.సి.పల్లె సెంటర్లో దైవజ్ఞ అనే రైతు.

.....

మర్రిపాడు నుంచి నందవరం డి.సిపల్లె మీదుగా కరటంపాడు చేరేసరికి మధ్యాహ్నం నలభైవొక్క డిగ్రీల ఎండ... నేరుగా రోడ్డుపక్క బంకులో వ్యక్తిని అడిగాం.... వచ్చేపోయ్యే లారీల ఘోషలో.. ఎట్లా వుంది. మీ పరిస్థితి అంటూ... రోడ్డు పక్క మాలోండళ్ళకు దినగండగా వుంది. ఈ మధ్యే మా ఆడోళ్ళు రోడ్డు మీద పడ్డారు. ఐరన్ పొడి గాలిలోకి పోయి విషం అయిపోయింది. సెప్టిక్ అయ్యిందని నారాయణ హాస్పిటల్ డాక్టర్ కూడా చెప్పాడు. రెండునెల్లా ఇరవై రోజులు ఆస్పత్రిలోనే జరిగిపోయింది. గాయం మానేదానికి వేల రూపాయలు ఖర్చులయ్యాయి అంటూ వాపోయాడు అబ్దుల్ షుకూర్... ఇంతలో పక్కనే వున్న వొక ప్రభుత్వోద్యోగి రోజుకు వేల బళ్ళు వస్తున్నాయనీ గుద్దేసి లారీలొళ్ళ పాటికి వొళ్ళు మాటా, మంతీ లేకుండా పోతున్నారనీ, యిష్టారాజ్య మయి పోయిందని ఆవేశపడ్డాడు. యింతలో ఎనిమిదో తరగతి అల్లా భాషా, తొమ్మిదోతరగతి గోవిందమ్మ పరీక్షలు రాసి అట్టలెత్తుకొని అక్కడికి వచ్చేరు. మీ సంగతేంది నాయినా అంటే, రోడ్డుకు ఆ పక్క స్కూలుంది సా, రోడ్డు దాటాలంటే ఇబ్బందిగా వుంది సా... డ్రైవర్లు తాగేసి ఎట్టబడితే అట్ట తోలతుండారుసా... అంటూ ఎక్కాలు లొప్పజెప్పినట్లు ధీటుగా జెప్పి తుర్రుమన్నారు.. ఐరన్‌లారీలను తప్పిచ్చుకొని.

కరటంపాడు సెంటర్‌లో ఆటోడ్రైవర్ వెంకటేశ్వర్లు, తన ఆటో అద్దాలు ఐరన్ లారీల వల్ల పగిలి పోయాయనీ పదివేలు నష్టం వచ్చిందనీ, నష్టపరిహారం అడిగితే తన్నను వొస్తున్నారని విచారించాడు. రాత్రుల్లో రోడ్డు దిగరనీ, డిమ్ అండ్ డిప్ కొట్టరనీ, పవర్‌ఫుల్ హాలోజన్ లైట్లతో కళ్ళు కనపడకుండా పోతున్నాయని ప్రైవేటు బస్ డ్రైవర్ అహ్మద్ భాషా ఆవేశంతో చెప్పాడు.

......

కరటంపాడు నుంచి బి.చిరువెళ్ళకు చేరాం. దారంతా ఐరన్‌వోర్ దుమ్ము పట్టాలు కూడా కట్టుకోకుండా లారీలు ఐరన్‌వోర్‌ను తరలించడం వల్ల వొళ్ళంతా దుమ్ము... కళ్ళల్లో మంటలు... రోడ్డు పక్కనే బస్ కోసం చూస్తున్న టీచర్ రఘు రామ్‌రెడ్డిని పలకరించాం. ఈ లారీల వల్ల ఎక్కడ జూసినా యాక్సిడెంట్లే సార్ అంటూ చుట్టు పక్కల జరిగిన ప్రమాదాల వివరాలు చెప్పాడు.

......

మధ్యాహ్నం ఒంటిగంటయ్యింది. బి చిరువెళ్ళ నుంచి నేరుగా ఆత్మకూరికి పొయ్యి వో హోటల్లో ఏదో భోజనం అయ్యిందనిపించి

ఆత్మకూరు దాటిన తర్వాత ఎండకు తెపరాయించు కొనే దానికి రోడ్డు పక్కన చెట్టుకింద ఆపి తిరిగి బయలు దేరి ఆత్మకూరి కొండ ల్లోంచి వుండుండీ వీచే వేడిగాలుల మధ్య జాలయ్య నగరం చేరేసరికి మూడూ పదయ్యింది. జాలయ్య నగరంలో రచ్చబండ మీద కూర్చున్న వెంకటేశ్వర్లు, వెంకటరెడ్డి, అ పక్కనే బంకు ఖాదర్‌బాషా ఐరన్‌వోర్ లారీల పైన నిప్పులు చెరిగారు. మధ్య మధ్య పచ్చి బూతులతో సత్కరించారు. ఐదారు యాక్సిడెంట్లు ఇక్కడే జరిగాయి. ఒక్క నిమిషం కూడా ఖాళీలేదు. లారీలు పోతానే వుండాయి. కర్నాటకలో ఐరన్ లారీని పగలు ఆపేసి రాత్రిళ్ళే వదులుతుండరు. ఈడా అట్ట జేసే నాకొడుకే లేడు. పోలీసులు లైను మీద కలెక్షన్లు జేస్తుండారు. అధికారులు టన్నుకింతని లాగేస్తుండారు. దుమ్ము చిన్నంగా లేదు. సైకిలు కూడా తొక్కలేక పోతున్నాం అని చెప్పేరు. అక్కడే వున్న గిరిజన కాలనీలో రమణయ్య, అంకమ్మ, నరసయ్య మాట్లాడుతూ ఏవని జెప్ప మంటావయ్యా పిలకాయిలిదే భయం గుంది. రేత్రిళ్ళు నిదరేడుంది? వొకటే లారీల శబ్దాలు అంటూ ఆలుగోడు బాలు గోడుమన్నారు. వాసిలిలో సుబ్బారాయుడు, ప్రసాద్‌లు ఐరన్‌వోర్ లారీలు సృష్టిస్తున్న విధ్వంసాన్ని వివరించారు. వాసిలి నుండి పెరుమన చేరే సరికి సాయంత్రం నాలుగయ్యింది. సిరమానంలో రమణయ్య గాజుకళ్ళతో శూన్యంలోకి చూస్తో నిరాసక్తంగా చెప్పేడు. ఉపాధి హామీ కూలీకి పోయిన తన భార్య అంకమ్మను పరమట నుంచి తోలే మట్టిలారీ ఎలా గుద్దేసిందో... అక్కడే గాయాలతో మంచం పట్టిన మరో వ్యక్తినీ చూపించాడు. అక్కణ్ణుంచి సంగం చేరేలోగా తలప్రాణం తోకలో కొచ్చింది.

.....

సంగం రోడ్డు రోడ్డంతా అధ్వానం. విపరీతమైన ట్రాఫిక్‌జామ్‌లు, అటూ ఇటూ ఒక కిలోమీటర్ పొడవుండే సంగం మెయిన్‌బజార్ రోడ్‌లోనుంచి ఐరన్‌వోర్ లారీలు వెళతాయి. సంగం రోడ్డు ఒకవైపు సిమెంట్ రోడ్డు దాని పక్కనే మట్టిరోడ్డు.. ఇళ్ళూ వాకిళ్ళూ... అంగళ్ళూ... మనుషులూ పశువులూ, వాహ నాలు తెల్లటి దుమ్ము పౌడర్‌తో నిండిపోయి వుంటాయి. ఎవర్నడిగినా ఒకే మాట ఏం చేస్తాం సార్... మా ఖర్మ ఎవరికి జెప్పాలి? ఈ మూడు మాటలే...

రిక్షాతోలే ఆంజనేయులు, గిరి, సున్నం కార్మికుడు, హరీష్ ఇద్దరు ముగ్గురు కారు డ్రైవర్లు మమ్మల్ని చుట్టుముట్టి గంటసేపు వాళ్ళ కష్టాలు చెప్పి వదిలారు... దగ్గులొస్తున్నాయనీ, మొఖాలు కడుక్కోగలిగినా గుడ్డలు పనికిరాకుండా బోతున్నాయని, జుట్టు వూడిపోతుందనీ, దగ్గినా గొంతులో నుంచి దుమ్ము వస్తుందనీ, కళ్ళు మంటలనీ, ఒకటే ప్రమాదాలనీ, ఇటీవల జిల్లా కలెక్టరూ, ఎస్.పి. కూడా ట్రాఫిక్‌జామ్‌లో అరగంట ఇరుక్కు పోయారనీ ఈ సంగతి పేపర్లలో కూడా రాశారనీ.... వొకటా.. రెండా.. సైకిల్ షాపుకు వస్తుంటే వెనుక నుంచి ఐరన్‌లారీ గుద్దిందని విరిగిన కాలును చూపించాడు తిరుపతిరెడ్డి. ఒక కాలితో అతనిప్పుడు కుంటుకొంటూ నడుస్తున్నాడు. జనం గుంపులు గుంపులుగా పోగయ్యారు. వొక్కొక్కరిదీ... వొక్కో కష్టం. బాధల వొర్షం....

....

సంగం దుమ్ములో నుంచి ఐరన్‌వోర్ లారీలు నలిపి నాశనం చేసిన ఎగుడు దిగుడు రోడ్లమీదుగా బుచ్చిరెడ్డి పాళెంకి చేరేసరికి ఆరయ్యింది. ఐరన్‌లారీల ప్రవాహం కూడా పెరిగింది. ఇక్కడ కూడా సంగం లాగే హోరున దుమ్ము, లారీల హారన్లు చెవులు పగిలేలా... వాటి దెబ్బకి కకావికలవుతున్న వూరి ట్రాఫిక్... సార్ ఇనుపపొడి సార్ దానికి తోడు ఎక్కడ బట్టినా దుమ్ము, రోడ్డు కూడా సక్రమంగా లేదన్నాడు కారుడ్రైవర్ మస్తాన్. ఐదు గంటల నుంచి బండ్లు ఆపేస్తున్నామని, కల్లు చెట్లకిందంతా ఐరన్‌వోర్ లారీవాళ్ళే అనీ, తాగి తోలు తున్నారనీ, చిన్న చిన్న క్లీనర్ పిల్లకాయలు కూడా తోలుతున్నారనీ చెప్పాడు జమాల్. పోలీసులు, ఆర్టీవోల కంట్రోల్ లేదని, సిఎం లారీలని వొదిలేస్తున్నారని చెప్పాడు (మర్రిపాడు నుంచి చాలామంది ఆ మాటే మాతో అన్నారు).



ఈ రోజు కూడా నెల్లూరు నారాయణ కాలేజీ కాడ 300 లారీలను ఆపేశారని వో ఆటోడ్రైవర్ అన్నాడు. లారీలు ఇట్టరాకుండా వేరే రోడ్డేస్తే బాగుణ్ణు, బండెనక బండి గంటల కొద్ది అగి పోవడం, మనుషుల్ని గుద్దేసి ఎల్లి పోవడం, లెక్కా జమా లేకుండా వుందనీ బస్టాండ్‌లో నిలవలేకుండా వుండామనీ, రోడ్డుదాట లేకుండా, పగలే కళ్ళు తెరవ లేకుండా వుండామని ఆర్‌టిసి ముఠా కూలీలు రమణయ్య, హాజరత్‌లు ఆగ్రహించారు. గత రెండు నెలల్లో 25 మంది చనిపోయారనీ, రాత్రుల్లో నెల్లూరుకు పోవాలంటే వల్లకావడం లేదని జీప్ డ్రైవరు రఫీ, మహ్మద్‌భాషా వాపోయారు. గంటలు గంటలు ఐరన్‌వోర్ లారీల గురించి చెబుతూనే వున్నారు.

.....

మళ్ళీ తెల్లవారు జామున నాలుగు గంటలకు బుచ్చివైపుగా ప్రమాణం ఆ రోజు బుచ్చి కొవ్వూరు, నెల్లూరు, ముత్తుకూరుల మీదుగా కృష్ణపట్నం చేరి అక్కణ్ణుంచి తిరిగి ముత్తుకూరు మీదుగా వెంకటాచలం రైల్వేస్టేషన్‌తో మా ప్రయాణం ముగుస్తుంది. ఆ రోజు నెల్లూరు సండే మార్కెట్‌లో చెప్పుల వ్యాపారం చేసే షణ్ముగం నాకు కంపానియన్. సండే మార్కెట్‌లో ఛాయ్ తాగి ఇద్దరం హీరో హోండా ప్యాషన్ ప్లస్ పైన రేబాల సెంటర్‌కు ప్రయాణం.... ఐరన్‌లారీల మధ్యలో... నింపాదిగా నిదానంగా...

.....

రేబాల సెంటర్లో వొక రాజకీయ పార్టీ జెండా దిమ్మె పైన కూలబడిన వరదయ్య మాటల పురుములు పురిమాడు... మమ్మల్నిందర్నీ తొక్కించేస్తుండారు. నాశనం చేస్తుండారు. వేల లారీలు వస్తా బోతుండాయి. అన్నీ రాజశేఖరరెడ్డి మట్టి లారీలే.. యాడబట్టినా యాక్సిడెంట్లే... దుమ్ము అమాంతంగా కళ్ళకు దగలతా వుంది. ఈసారి ఈ రెడ్లనందరిని ఎలక్షన్‌లో వోడి పిచ్చేస్తామని నా మాటగా మీ అఫీసర్లకు

జెప్పండని నాపైకి దూకాడు. అక్కడ్నించి లక్ష్మీపురం సెంటర్లో మేము గవర్నమెంటోళ్ళనుకొని ప్రజలు శాపనార్థాలు పెట్టారు. సంతోషంగా విని.. కాగులపాడుకు వెళ్ళాం... కాగులపాడుల ఐరన్‌లారీ ఆటోను గుద్దడంతో ఆరుమంది చనిపోయారు. మృతుల బంధువుల కన్నీటిలో తడిసి ముద్దయ్యాము. మా అమ్మ, మా అత్త, సీనయ్య, లక్షమ్మ, పేరమ్మ, చిలమత్తూరు కామేశ్వరమ్మ అందరూ చచ్చిపోయారని పద్మ చెప్పింది. అ అమ్మాయి ఇంకా షాక్ నుంచి కోలు కోలేదు. కాగులపాడు నుంచీ మఠం, దామరమడుగు, గిరిజన కాలనీ, గంగవరం సెంటర్, ఎంప్లాయీస్ కాలనీ, పోతిరెడ్డి పాళెం సెంటర్, ఎంప్లాయీస్ కాలనీ, షుగర్‌ఫ్యాక్టరీ, వారధి సెంటర్ సాలు చింతల సెంటర్‌ల మీదుగా కోవూరు చేరాం ఐరన్‌లారీలతో బాటే... ఎవర్ని కదిలించినా చావులే... ప్రమాదాలే... "దుమ్ము బాధలే... దగ్గూ... అలూసాలూ, కళ్ళు మంటలే కొవ్వూరు మెయిన్‌రోడ్లో నుంచి బైపాస్ మీదుగా ఐరన్‌వోర్ లారీలు నెల్లూరుకి చేరుతాయి... కొవ్వూరు వూరువూరంతా దుమ్మే. చాలామంది ముక్కుకు గుడ్డలు అడ్డుపెట్టుకొని నడుస్తున్నారు చిక్కటి దుమ్ములో. కోవ్వూర్లో ఈ లారీలు వచ్చినప్పటి నుంచీ ఆయాసం, దగ్గు, డస్ట్ అలర్జీ, ప్రిస్క్రిప్షన్స్ పెరిగాయని మెడికల్ షాప్ రమేష్ చెప్పాడు. తన అంగట్లో పేరుకుపోయిన దుమ్మును చూపించాడు. చిన్న చిన్న అంగళ్ళ వాళ్ళందరూ ముక్కుకు గుడ్డలడ్డు పెట్టుకొని వ్యాపారం చేయడం చూశాం. రోడ్లన్నీ గలీజయిపోతున్నాయి. వొకటే శబ్దాలు, నాలుగుమాట్లు ధర్నాలు చేసినా. ఎవరు పట్టించుకోలా... నాయకులే డబ్బులు తీసుకొని ధర్నాలు ఆపేస్తున్నారు. వూరంతా ఇదే పరిస్థితి అని వాపోయాడు సైక్లిస్ట్ వెంకటేశ్వర్లు. అలర్జీ, అస్థమా కేసులు ఎక్కువగా వస్తున్నాయి. ఐరన్‌తో బాటు కార్బన్ పొల్యూషన్ కూడా ఎక్కువగా వుంది. ఐరన్‌వోర్ డస్ట్ ఉపిరితిత్తుల్లోకి వెళితే అవి అట్లా పేరుకుపోతాయి. పది, పదిహేను ఏళ్ళకు కూడా లంగ్ డిసీజెస్ వచ్చే అవకాశం వుంది. వోవర్ టన్నేజ్ వల్ల బ్రిడ్జిలు కూడా దెబ్బ తింటున్నాయి. ఇంతకు ముందు స్కూటర్‌లో క్లినిక్‌కు వచ్చే వాణ్ణి. 500 రూపాయిలు నెలకు ఖర్చయ్యేది. ఇప్పుడు దుమ్ముకు భయపడి కార్లో వస్తున్నాను. నెలకు ఐదువేల రూపాయల ఖర్చవుతున్నాయని కొవ్వూరు ఎంబీబియస్ డాక్టర్ సురేష్ చెప్పాడు. మొత్తం కొవ్వూరంతా దుమ్ము గొట్టుకుపోయింది. అందరిదీ వొకే కష్టం... దగ్గు.... దుమ్ము..



....

కొవ్వూరు నుంచి ఐరన్‌లారీలతో బాటే నేషనల్ హైవే ఎక్కాము నెల్లూరుకు వెళ్ళేం దుకు... దారంతా కిలో మీటర్ల పొడుగున బారులు తీరిన ఐరన్ వోర్ లారీలు... వాటిని దాటు కొంటూ నెల్లూరు చిల్డ్రన్స్ పార్క్ రోడ్‌లోకి వెళ్ళాము. రోడ్‌పైకి ఎక్కడమే వూటీలోని మంచు తెరల్లాంటి దుమ్ము తెరలోకి ఎంటరయ్యాం. రోడ్డుకు ఆ పక్క ఈ పక్క నివసించే గిరిజనుల గుడిశెలన్నీ ఎర్రటి దుమ్ము మలాం. ఇళ్ళూ, చెట్లూ... మనుషులు ఎర్రటి దుమ్ములో చెక్కిన శిల్పాల్లా వున్నారు. రెడ్ ఇండియన్స్ గుర్తొచ్చారు... గిరిజనుల పిల్లలంతా ఎర్రగా.. ఎక్కువ దుమ్ము వస్తా వుంది... బిడ్డలూ, మేము ఎర్రంగా బోతుండాం... వొకటే దుమ్ము... మాయిందరి పరిస్థితి ఇంతేనంది గుడిశెపక్క బిడ్డల్ని ఆడిస్తున్న గిరిజన కూలీ మునెమ్మ... పిలకాయలు ఎట్ల ఎర్రగా బొయినా రోజూడు... నూగు, జిల, మట్టి వొళ్ళంతా వొకటే నవలు.. జిలలు. స్ట్రైక్ జేసినా ఆగకపాయే లారీలు. ఈ దుమ్ములోనే అన్నం దింటుండాం. ఈ రోడ్డు పక్క ఐదారు వందల మందిదీ ఇదే పరిస్థితి... చూస్తానే వుండావు. గదా.. రోడ్డు జూడు పెచ్చులు పెచ్చులుగా... ఒకటే దగ్గూ... జలుబూ.. డాక్టర్ల చుట్టూ తిరగానే సరిపోయింది టయమంతే... గిరిజన కూలీ సీనయ్య మాటల నేపథ్యంలో వరసగా కృష్ణపట్నం వైపు ఎర్రటి దుమ్ము లేపుకుంటూ దూసుకుపోతున్న ఐరన్‌వోర్ లారీల బారు చీమల్లా... కాస్త ముందుకెళ్ళగానే సాయిబాబా గుడి దగ్గర భిక్షగాళ్ళు ఈగా వెంకయ్య, సుందరమ్మ ఇద్దరూ చెప్పేరు ఏం జేస్తాం నాయినా ఈ దుమ్ముకి ఇట్టబడుండే అని.

అక్కడి నుంచి చిల్డ్రన్ పార్కు పార్కంతా దుమ్మే పుట్‌పాత్‌పై, గోడలపై, చెట్లపై ముద్దలు ముద్దలుగా దుమ్ము ఎర్రటి ఐరన్‌వోర్‌పొడి... కళ్ళమంటల్లో పార్కు దాటి హరనాధ పురంలో నుంచి ముత్తుకూరు రోడ్డుపైకెక్కాం. హరనాథపురంలో మెకానిక్ అఫ్సర్ సాయంత్రానికి వూపిరాట్టం లేదు సార్ అన్నాడు. బాలాజీనగర్ జనార్థన్ అయితే ఇంత ఘోరంగా వున్నా పేపర్లో రావడం లేదేం సార్ అన్ని ప్రశ్నించాడు. ధనలక్ష్మీపురంలో పోలిరెడ్డి లారీల వల్ల ఆ ప్రాంతంలో ఎంతమంది చనిపోయిందీ... కాళ్ళిరగొట్టుకొందీ వివరించాడు. హరనాథపురం నుంచి కృష్ణాపట్నం బేసిన్ దాకా నలభై చోట్ల డబల్‌రోడ్‌లో ట్రాఫిక్ నియంత్రణకు ఇనుప డబ్బాలు అడ్డం పెట్టున్నారు. ప్రతి పాయింట్‌లో పోర్టు తాలూకా సెక్యూరిటీ గార్డు ఒకరుంటారు. నేషనల్ హైవేలో కూడా లారీలను నియంత్రించేది పోర్టుకు సంబంధించిన ప్రైవేట్ సెక్యూరిటీగార్డులే. పన్నెండు గంటలు డ్యూటీ చేయాలి నాలుగు వేల రూపాయలు నెలకిస్తారని పేర్లు చెప్పొద్దని నాతో అన్నారు. మాదరాజు గూడూరు సెంటర్‌లో బడిగోడ మీద కూచ్చోని ఐరన్‌వోర్ లారీలను గమనిస్తున్న పిల్లల్లో నందిని అనే చిన్నబిడ్డ... యాక్సిడెంట్లు జరగతాయని భయమేస్తావుంది సా... నిన్నే ఐరన్ లారీ ట్రాక్టర్‌ని గుద్దేసింది మనుషులు గూడా ఒకరిద్దరు సచ్చిపోయారు సా. ఇంకోకాయన రెండుగా తెగిపోయానాడు సా... బతకడని చెప్తుండారుసా... అని భయం భయంగా చెప్పింది. అట్లా డివైడర్లనూ, ఐరన్‌లారీలనూ, యాక్సిడెంట్ అయిన లారీలను దాటుకొంటూ కాకుపల్లి గమళ్ళపాళెం, సాయిబుల పాళెం, నారాయణ కాలేజీ, తాళ్ళపూడి, లక్ష్మీ నరసాపురం మీదుగా మధ్యాహ్నాం ఒకటిన్నరకు ముత్తుకూరు చేరాం.

....

ఎర్రమట్టిలో పొర్లాడిన పసిబిడ్డలా వుంది ముత్తుకూరు. బాడుగలు తోలుకోలేక పోతున్నామనీ, గుడ్డలన్నీ ఎర్రగా బోతున్నాయినీ... దుమ్ముకు నిలవలేక పోతున్నాయనీ, లారీలు ఆగే దారేలేదా? అని యాష్టపోయాడు ఆటో డ్రైవర్ సురేష్... ఎవర్నిడిగినా ఎర్రదుమ్ము బాధలే ఐరన్‌వోర్ లారీల సంగతులే... అక్కణ్ణుంచి గోపాలపురం చేరుకున్నాము. చెట్ల కింద వుప్పు పండించే రైతులు గొల్లుమన్నారు. మొత్తం వాళ్ళకు సంబంధించిన ఏడొందల ఎకరాల్లో ఐరన్ వోర్ పడి తెల్లటి వుప్పు పంట ఎర్రగా అయిపోయిందని, పోర్టోళ్ళు పైసా పరిహారం ఇవ్వలేదని ఘోషించారు. కలెక్టర్‌కి అర్జీలిచ్చినా... ధర్నాలు చేసినా ఫలితం లేదని కలిశెట్టి సుబ్బారావు, మధులు నిరాశపడ్డారు. గోపాలపురంలో కూల్ డ్రింక్ షాపు సుభాషిణమ్మ, వెంకట రమణమ్మ, వెంకటేశులు దుమ్ముగొట్టుకుపోయిన వాళ్ళ ఇళ్ళను చూపించి దుమ్ము తాగుతా, పీలుస్తా, తింటా వుంటాం సార్ అన్నారు. గోపాలపురం నుంచి కృష్ణాపట్నం పోర్టు వరకూ మొత్తం చెట్లు, చేమలూ, పొలాలు, రోడ్లు, పిట్టలూ, కుక్కలు సమస్య. ప్రకృతికీ ఐరన్ వోర్ ఎగుమతిదార్లు ఎర్రరంగు పులిమారు... అద్భుతం... దార్లో మామూలుగా తెల్లగా కళ్ళు మిరమిట్లు గొలిపే వుప్పు కయ్యిలన్నీ ఎర్రగా... పోర్టు పోర్టంతా ఎర్రటి దుమ్ము, మనుషులు, పశువులు... అంతా ఎర్రగా పంథొమ్మిది వందలా డెబ్భైల నాటి ఈస్ట్‌మన్, గేవా కలర్ క్రైమ్ సినిమాల్లా ఎర్ర రంగు... ఎర్రటి దుమ్ము మేఘాలూ... బకింగ్‌హామ్ కాలువ అంచున సగం నరికేసిన మడిచెట్లు నిండా ఎర్రటి దుమ్ము... బకింగ్‌హామ్ కెనాల్లో ఐరన్ వోర్ నీళ్ళు ఎర్రగా... కోస్టల్ జోన్ రెగ్యులేషన్ యాక్టులూ, పర్యావరణ చట్టాలూ గుర్తొచ్చి వెర్రి నవ్వొకటి నవ్వుకొన్నాను. నోట్లో కింత ఎర్ర దుమ్మొచ్చింది. బకింగ్‌హామ్ కాలువ వంతెనపై నిలబడి పోర్టుకేసి చూశాను వెర్రిగా. మధ్య దళారీలు, ఐరన్ వోర్ మట్టి దిబ్బలు, జైగంటిన్ క్రేన్లు భారీ శబ్దాలు, రణగొణ ధ్వనులు చీమల్లా పనిచేస్తున్న కూలీలు ఎర్రగా. కనాకష్టపు కరువు రోజుల్లో ఈ కాలవ తవ్వేదానికి ఈ ప్రాంతానికి వలస వచ్చిన నా ముత్తాతల రెక్కల కష్టం గుర్తొచ్చి కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరిగాయి. పోర్టు ముందు కెళ్ళాము. బోర్డు ఆజ్ఞాపించింది...

"అనుమతి లేనిదే ప్రవేశం లేదు...."

.....



వెనక్కి తిరిగి ముత్తుకూరుకొచ్చి భోంచేశాము... సహించడం లేదు... హోటల్ బయట ఎంత బతిమలాడినా పేరు చెప్పని వొక పట్టపు కాపు పోర్టు మూలంగా ఛిద్రమైన జాలర్ల బతుకు, వెతల్ని కతలు కతలుగా చెప్పాడు... అచ్చు వేయడానికి నా రాష్ట్రపు పత్రికలకి స్థలం దొరకనే దొరకదు. కృష్ణపట్నం నుంచి రామతీర్థం దాకా సముద్రం నీళ్ళనీ కలుషితం అయిపోయాయనీ వేల టన్నుల ఐరన్ వోర్ మట్టి లోడింగ్ వల్ల ఐరన్ వోర్, ఆయిల్ సముద్రంలో తెట్టు కట్టిందనీ, ఇరవై ఐదు పట్టపు గ్రామాలు కూడులేక కునారిల్లుతున్నాయనీ కోటమండలం గోయిందపల్లి నుంచీ రామతీర్థం దాకా వందలాది పట్టపు పాళేలకు వలస తప్పదనీ, ఇప్పటికే చేప దొరక్క ఖాళీ పడవలతో గట్టుకు చేరుతున్నామనీ భోరుమన్నాడు. ఆరు తుఫాన్లకు ఎదురు బొయినా... వొక్క సునామీకి ఎదుర్రొమ్ము తాటిచ్చా... ఈ పోర్టు దెబ్బకు మాత్రం వొళ్ళూ కళ్ళూ తిరిగి పడ్డాను నాయనా అంటూ కళ్ళనీళ్ళు బెట్టుకున్నాడు పట్టపు కాపు. మూడుగంటలకు ముత్తుకూరు నుంచి వెంకటాచలం బయల్దేరాం... ఎర్ర దుమ్ము గొట్టుకున్న గుడ్డలతో... మధ్యలో బలిజపాళెం గిరిజన సెంటర్‌లో కూలీ రమణమ్మతో మాట్లాడాం. మాకెట్టుంటుందా? బాధపడతా వుండాం. రాత్రిళ్ళునేలతోటి అద్దిరి పోతా వుండాది. ఏం జేయమంటావు? అందర్నీ అడుగుతుళ్ళా? అన్నంలో గూడా దుమ్మే, అడగుతుల్లా నాయకుల్ని... వస్తా వుండారు.. పోతుండారు అంటూ నడిచి వెళ్ళిపోయింది. పక్కనే... బిందెలో తాగే నీళ్ళు పట్టుకొంటున్న గౌరి నీళ్ళ బిందెలో ఐరన్ లారీలు తీసిన ఎర్రటి దుమ్ము తెరలు తెరలుగా... ఖళ్ళు ఖళ్ళున దగ్గుతూ పోలమ్మ చెప్తా వుండాడు. భలే స్పీడు పోతుండాయి సా లారీలు. ఎన్నిసార్లు మండలాఫీసులో చెప్పినా పట్టించుకోరు... అంటూ. బలిజపాళెం వూరు వూరంతా చెట్లూ, వాములూ, ఇళ్ళూ ఎర్రటి దుమ్ము.... పొలాల్లో కూడా ఎర్ర దుమ్మే. రోడ్డు వక్కన స్కూల్లో ఎండాకాలం ఆటలాడుతున్న పిల్లలందరూ దుమ్ము సార్ దుమ్ము చెవులు పగిలే శబ్దాలు సార్ అంటూ పోటీ పడి చెప్పారు. దార్లో సుబ్బారెడ్డి పల్లెలో మీరయ్య కనీసం స్పీడు బ్రేకర్లు వేయమన్నా వేయడం లేదని కోపగిచ్చు కున్నాడు. దార్లో గిరిజన సంఘం, కోళ్ళమెట్టపూర్లలో ఇదే రగడ. ఎక్కడ చూసినా ప్రజాగ్రహం... నిస్సహాయ ఆవేశం... పంచాంగివారి కండ్రిగలో కాటా ఈశ్వరమ్మ, సుధలు మా ఇళ్ళు జూడపో రేత్రిళ్ళు ఇళ్ళల్లో పొణుకోలేకపోతున్నాం... దుమ్ముగొట్టుకొని మా బిడ్డ, గొడ్డూ గోదా నాశనమైపోతున్నారని ఈసడించుకున్నారు అధికారులను. తాతా పుల్లయ్య, రమణమ్మలయితే లారీల శబ్దాలకు పగిలిపోయిన బానల్నీ, ఇళ్ళ గోడల్నీ చూపించారు. తాతా పుల్లయ్య అయితే తన పెట్టల్నీ... పుంజుల్నీ అన్నింటినీ లారీలు తొక్కేసినాయని విలపించాడు. కోడయితే ఒకటీ, బిడ్డయితే వొకటా? అని యాష్టపోయాడు. ఈ లారీ నా కొడుకుల అంతం చూస్తానని శపథం చేసి సవాలు విసిరాడు. ఈ మార్గంలో ఐరన్ వోరే కాకుండా టిప్పర్లలో పోర్టుకు గ్రావెల్ కూడా తరలిస్తున్నారు. వొక్కదానికీ పైన పట్టలేదు. కూల్‌డ్రింక్ షాపు శేఖర్ అయితే దుమ్ముకు కళ్ళు దెబ్బతిని ఐదువేలు ఆస్పత్రులకు ఖర్చుబెట్టానని చెప్పాడు. నిడిగుంటపాళెం సెంటర్‌లో వెంకట్రావు అసలు రహస్యం చెప్పాడు. పోర్టు లారీలను భరించలేకుండాం సార్.. ఒక్కో లారీ రోజుకు 50 ట్రిప్పులు తోలుతుంది. ఎన్నో యాక్సిడెంట్లు జరిగాయి. రోజూ ఈ పక్క ఏదో ఒక చోటికి వన్నాట్ ఎయిట్ (108) వచ్చి పోతానే వుంటాది. యాక్సిడెంట్లు జరిగినపుడల్లా మేం బంద్ చేయడం, రాజకీయ నాయకులు వచ్చి మధ్యస్తాలు చేస్తా వుండారు. తిరగబడినోడి నోరు డబ్బిచ్చి మూయిస్తా వుండారు. ఈ నాయకుల టిప్పర్లు, లారీలు గూడా పోర్టు తోలకాల్లో వుండాయి సార్ అని చెప్పాడు. తర్వాత ఇసకపాళెం సర్వేపల్లిలో జెనాలతో

మాట్లాడుతూ వందల ఎకరాల్లో పోర్టు కోసం గ్రావెల్ తవ్వుతున్న ప్రాంతాన్ని చూశాం... అట్నుంచి నేరుగా వెంకటాచలం రైల్వే స్టేషన్‌కు చేరేటప్పటికి నాలుగున్నర అయింది సాయంత్రం...

.....

వెంకటాచలం రైల్వే స్టేషన్ రెండు కోట్ల వ్యయంతో కట్టించారని వెంకటాచలం శ్రీధర్ చెప్పాడు. స్టేషన్ అంతా ఎర్రదుమ్ము. స్టేషన్ ఎదురుగా ఎర్రటి ఐరన్ వోర్ దిబ్బలు తూర్పుగాలికి అంతా స్టేషన్‌లోకే... ఇదిగాక రైళ్ళు పోతూ వస్తున్నపుడల్లా స్టేషన్‌ను దాటుకొని వూళ్ళో ఇళ్ళ మీదికి ఎగిరే ఎర్రటి దుమ్ము స్టేషన్ ప్లాట్‌ఫారం అంతా ఎర్రటి దుమ్ము బుకింగ్ కౌంటర్ కిటికీకి దుమ్ము రాకుండా పెద్ద కర్టెన్ కట్టేశారు. కర్టెన్ తొలగించి టికెట్లిస్తున్నారు ప్రయాణీకులకు... లోపల సిగ్నల్ బోర్డంతా దుమ్మే... స్టేషన్‌లో కసుమూరు దర్గాకు, గొలగమూడి వెంకయ్య స్వామిని దర్శించుకునేందుకు వచ్చే వందలాది మంది ప్రయాణీకులకు తోడు వెంకటాచలంలో వుండే రెండు ఇంజనీరింగ్ కాలేజీల స్టూడెంట్లు రెండు వందల మంది దాకా రోజూ ప్రయాణిస్తుంటారు. స్టూడెంట్లదో ప్రత్యేకమైన బాధ. వీరికి కాలేజి యూనిఫారం తెల్లది కావడంతో వుతకలేక ఇంట్లో అమ్మలు అల్లాడు తున్నారని వెంకటేశ్వర్లనే స్టూడెంట్ చెప్పాడు. ఐరన్‌వోర్ సమస్యపై ఎవరికి ఫిర్యాదు చేయాలో తెలియదన్నాడు. స్టేషన్‌లో ప్రయాణీకులు ముక్కులకు చేతి గుడ్డలు కట్టుకొని వుండటం చూశాను. రైల్వే వోళ్ళకి చెప్పినా పట్టించుకోవడం లేదని రైల్వే ఎంప్లాయ్ సుబ్రమణ్యం ఆవేదన వ్యక్తం చేశాడు. చెనక్కాయలు అమ్మే ముసలమ్మ కూడా దుమ్ముకు ఛస్తా వుండామని యాష్టపోయింది. నాయకులు కుమ్మక్కై ఎవరూ అడగడం లేదని, వెంకటాచలంలో ఇకపై ఇళ్ళకు తెల్ల సున్నం బదులు ఎర్రరంగు వేయించుకునే పరిస్థితి వుందనీ... ముసలోళ్ళకి వెంట్రుకలు ఎర్రగా నెరుస్తుండా యనీ... వెంకటా చలం, సర్వేపల్లి క్రాస్ రోడ్‌లో ఐరన్‌వోర్ టిప్పర్ల వల్ల ఎంతోమంది చనిపోయారనీ పదే... పదే... పేపర్లో రాస్తున్నా ఎవరూ లెక్కచేయడం లేదనీ... అక్కడెక్కడో యాక్సిడెంట్ అయితే ఐరన్ లారీని ఆపించడానికి కడప నుంచి జీపు తీసుకొచ్చి కొట్టెళ్ళారనీ చెబుతూ స్టేషన్ బయట ఎర్రదుమ్ముతో నిండిన ఇళ్ళనూ... ఎర్రగా మారిపోయిన పిచ్చివాడినీ, చెట్లనూ... కోతుల్నీ.... కుక్కల్నీ చూపించాడు... అతనితో మాట్లాడుతూ స్కూటర్ అద్దంలో ఎర్రగా మారిపోయిన నా మొహాన్ని చూసుకున్నాను.

అట్లా ముగిసింది... ఆ రెండొందల కిలోమీటర్ల పై చిలుకు... రెండ్రోజుల ప్రయాణం... ఐరన్ వోర్ లారీల మధ్య... ఐరన్ వోర్.. ఐరన్ మట్టి... యినుప మట్టి... కృష్ణపట్నం వార్త విలేకరి కళ్ళలో ఇన్‌ఫెక్షనయిన ఐరన్ వోర్... పంటపాళెం సెంటర్ కూల్‌డ్రింక్ షాప్ కళ్ళల్లో ఐదువేల రూపాయల మందుల బిల్లు మంటై భగ్గుమన్న ఐరన్ వోర్... నా జిల్లా అనాదులు అనాథలు... జిల్లా యానాదుల వొంటిపై ఎర్రగా గడ్డకట్టిన ఐరన్ వోర్... ఎక్కడో ఓబులాపురం గనుల గుండెల్లో నిద్రిస్తున్న ఐరన్‌వోర్... యినప మట్టి... కరటంపాడు అబ్దుల్ షుకుర్ ఆడోళ్ళ చేతి గాయంలో దూరి నింపాదిగా నంజుతూ.... నములుతూ కుళ్ళిస్తున్న ఐరన్‌వోర్... తెల్ల చొక్కాలపై ఎర్రగా పరుచుకుంటున్న ఐరన్‌వోర్... ఎర్రని రక్తపు ఇనుప మట్టి నెత్తుటి నోటితో... డెబ్బై మందిని కబళించిన ఐరన్‌వోర్... వేలాదిమంది వూపిరితిత్తుల్లో సజీవంగా నిద్రిస్తున్న ఐరన్‌వోర్... కోట్లాది ఇనుప మట్టి దుమ్ము కణాలు... వేలాది మందిని చావనీకుండా... బతకనీకుండా... నిద్రపోనీయ కుండా... నిత్యమూ నరకయాతన పెడుతున్న ఐరన్‌వోర్...

Iron Ore... Iron Whore...

Whoring with the lives of thousands....

దేవుడి ప్రభుత్వమా వర్ధిల్లు...

# 'నవ్యశృతి!'

- వంగర పరమేశ్వరరావు



నన్ను
నిలువరించకండి!
నన్ను
నన్నుగా
సాగిపోనివ్వండి!
పాషాణ జడత్వాన్ని
తుద ముట్టిస్తూ...
చేతనత్వ ప్రాణ బీజాలను
విత్తుతూ సాగే...
నా భావాల
రాదారికి
అడ్డు తగలొద్దు!
కడగండ్ల
చీకటి కోనలో
ఊపిరాడక సతమతమవుతున్న
దుఃఖార్తుల
కన్నీటి చారికలను
తుడిచే
నా
ఆసరా చేతుల
మానవత్వ చేతలను
సంకుచిత సంకెళ్ళతో
బంధించొద్దు!
దీనజన సంక్షేమాన్ని
సదా నినదించే
నా గుండె గొంతుకను
ఎన్ని బాహ్య కట్టడులైనా
కట్టడి చేయలేవ్!
జనాభ్యుదయ
నా జీవిత పథం
ఏ ఎత్తుగడల
కుట్రలకు లొంగదు!
ఎవరి స్వార్థ ప్రలోభ
ప్రబోధ పాఠాలను వినదు!
నేనిప్పుడు
నా
నేల తల్లి ఘనత
సాక్ష్యంగా
త్యాగాల పట్టిక
రాస్తున్నాను!
దుమ్ము, ధూళిలో
కలిసిపోయిన
ధృవతారల
జాడల దారులను
వెతుకుతున్నాను!
నిర్భీతిని
నిబిడీకృతం చేసుకున్న
నా మాతృభూమిలోని
ప్రతీ మట్టికణం
వీరగంధ
పుప్పొడి పరిమళాలను
పొటమరిస్తూ
పరివ్యాప్తం చేస్తోంది!
ఈ
నా
పుడమిన
ఎన్ని
అరుణోదయ జడివానలు
ధీర ఉత్తుంగ జలపాత హోరులై
గంగ పరవళ్ళు తొక్కాయో...!!
వాయులీన రెపరెపలకు
కదలిన చరిత్ర పుటల దొంతర్లు
సువర్ణాక్షరాల భాగ్య చరిత
పసిడి కాంతుల్ని
వెదజల్లుతూనే ఉన్నాయ్!
చరిత్ర గతిలోని
ప్రతి మలుపూ
ఓ స్వేఛ్ఛా సంద్రకెరటమై
ఉవ్వెత్తున పైకెగసిన
సంపూర్ణా ధ్యాయాల
రణ ఝరి గీతాలు
చర్విత చరణాలై...ఇంకా
మారు మ్రోగుతూనే ఉన్నాయ్!
పదవులు
పట్టు పరుపులపై దొర్లుతూ
విలాసాల మత్తులో జోగుతున్నాయి!
అధిక ధరల తాకిడికి
తాళలేక
జన సామాన్యం
పొలికేక పెడుతున్నారు!
జన జీవన
బ్రతుకు క్షేమాన్ని
గాలికొదిలేస్తూ....
ఎన్నాళ్ళీ....
ప్రజా నిర్లక్ష్య వైఖరుల బాగోతం!
ఇప్పుడు
కావల్సింది...
జన ప్రగతికి దారులు వేసే
దీన జనోద్ధరణ ధ్యేయ నేతలు!
జాతిని
శాంతి పథంలో
నడిపే
మహిత మూర్తులు!!
జాతి పతాకాన్ని
సమున్నత శిఖరాలపై
రెపరెపలాడించే
నిష్కల్మష రుధిర
రుద్ర శక్తులు!!

---

# ఆశల హరివిల్లు

- కిలపర్తి దాలినాయుడు



ఆశయాల నీటి బిందువులు గుండా
ఆశల కిరణాలు పంపించు!
ఏడు రంగుల కల సాక్షాత్కారం!
'విశ్వాసం' ఆశయాల ఫాలభాగాన
'మూడో నేత్రమైతే...'
అడ్డంకుల 'మన్మథుడు' మసికాక తప్పదు!

బాధాతప్త హృదయం
చేవలేని భూమి కాదని
చిగురించిన ఆశయాల తీగలకు
ఊత కర్రను పాతితే....
ఫలితాల 'పండ్ల' గంప తలకెత్తుకోగలవ్!

నకిలీ ఏడు రంగుల లోకం చూసి
కుర్చీకి నిన్ను నువ్వు కట్టేసుకుంటే
గమ్యమనే స్వర్గానికి చేరువకాలేవు!
అది టెక్నాలజీ కీలు గుర్రంగానే చూడు!

విశ్వాస స్వర సర్పాలు
విశ్వాస సమయాన్ని కాటేయాలను
కున్నప్పుడు.... ప్రతి ఘటన నాదం... చేయ్!

విజయ భేరీ శబ్దాలను వినడానికి
కర్ణభేరిని సిద్ధం చెయ్!

ఏడు సముద్రాల ఆవల
గ్లోబల్ రాక్షసుని ప్రాణం
నీ చేతుల్లోనే ఉంటుంది!
సామ్రాజ్య లక్ష్మి
సామాన్యుడ్ని వరిస్తుంది
ఆశయాల నీటి బిందువుల గుండా
ఆశల కిరణాలు మాత్రం
నిరంతరమూ... ప్రవహించాలి!

కథ

# నివాళి

డా॥ సి. భవానీదేవి




**రామచంద్రరావుగారు సోఫాలో నీరసంగా కూర్చున్నారు. పెద్దకొడుకు శ్రీనివాస్ కొంత చిరాకుగా ఆయనవంక చూస్తున్నాడు. భార్య సుమిత్ర కొరకొరా చూస్తోంది. గది అంతా గంభీరంగా వుంది. ఏదో సమస్య వారి మధ్య నలుగుతున్నదని వాతావరణం స్పష్టంగా చెబుతోంది.**

"నాన్నా! మీకు ఇష్టమైతే ఎంతో కొంత డబ్బు ఇవ్వండి. ఆ పిల్లలను మీరే చదివించండి. వాళ్ళు ఎంత చదివినా దానికి మేము కాదనము. అంతేకాని మీ ఆస్తిలో కొంత అయినా వాళ్ళకు రాసిస్తానంటారేంటి? ఇలాంటి విడ్డూరం ఎక్కడైనా వుందా!"

"ఒరే శ్రీను! మానవత్వం ఉన్న ఒక మనిషిగా ఆలోచించావో లేదో నీకే అర్థమవుతుంది. క్రిష్ణ పిల్లలను చూస్తే నా గుండె తరుక్కుపోతోంది. అతని భార్య దుఃఖం నా గొంతు పిసికేస్తోంది. ఊపిరాడటం లేదు. క్రిష్ణ కుటుంబానికి అన్యాయం ఏ విధంగానూ జరగకూడదు."

'మిమ్మల్ని అన్యాయం చేయమనడం లేదు" రామచంద్రరావుగారి భార్య దీర్ఘం తీసింది నిష్ఠూరంగా.

"కానీ నేను చేయాలనుకున్నది అన్యాయమని గోల చేస్తున్నారు కదా"

"నాన్నా మీకు తోచింది చేస్తానంటే ఎలా? ఇతరులకు కూడా సమ్మతంగా ఉండాలి కదా."

"ఒరే శ్రీను నన్ను ఇబ్బంది పెట్టకండిరా! ఇంతకూ నేనన్నట్లు చేస్తే మీకు నష్టమేమిటో నాకర్థం కావడం లేదు. మీ అన్నదమ్ములిద్దరూ బాగా సెటిలయ్యారు. వ్యాపారాలు చేసుకుంటున్నారు. ఇంకా ఎందుకురా తాపత్రయం?! క్రిష్ణ చేసిన దానికీ, క్రిష్ణకు జరిగిన దానికీ నేనే విధంగా రుణం తీర్చుకోగలను? అతను లేని లోటు ఆ కుటుంబానికి ఎలా తీరుతుంది? ఆ చిన్నపిల్లల భవిష్యత్తు ఎలా?"

"దానికి ఇదా పరిష్కారం?" రామచంద్రరావుగారి భార్య ఉరిమింది.

"నీకెలా అర్థమవుతుంది సుమిత్రా! క్రిష్ణ ఏమీ ఆశించకుండా హృదయపూర్వకంగా ఔదార్యంతో తన కిడ్నీ సమర్పించుకున్నాడు. ఆ క్రిష్ణ పెట్టిన ఈ ప్రాణభిక్ష నా గుండె పిండేస్తోంది. ఆ నిస్వార్థతను నేను భరించలేను. నా మనస్సుకు ప్రశాంతత కావాలంటే దానికి ఇంకొక మార్గం లేదు. నా ఈ పనిలో ఏమాత్రం స్వార్థం కూడదు. నేను ఎంచుకున్న పరిష్కారం మీకు నచ్చకపోవడం నా దురదృష్టంగా భావిస్తున్నా. నా కుటుంబ సభ్యులు నా మాటకు, చేతకు ఎంతో ప్రోత్సాహం ఇస్తారని భావించా."

"సరిపడా డబ్బు ఇస్తాం కదా నాన్నా... ఇంకేమిటి?"

"డబ్బు ఎంతకాలం ఆ కుటుంబాన్ని రక్షిస్తుందిరా? ఈ రోజుల్లో పిల్లలు రెక్కలొచ్చాక వాళ్ళ భవిష్యత్ వెతుక్కుంటూ ఎగిరిపోతున్నారు. ఆ పరిస్థితిలో క్రిష్ణ భార్యకు ఆధారంగాని, భరోసాగాని వుంటుందా?"

"అలా అని అంతా దోచిపెడతానంటే నేనూరుకోను?" రామచంద్రరావుగారి భార్య హుకుం.

"సుమిత్రా! ఈ రోజున నీ ఎదురుగా బ్రతికున్నానంటే అది క్రిష్ణ పెట్టిన భిక్ష కాదా! ఈ ఆస్తి, ఈ బిడ్డలు, బంధువులూ ఏమీ చేయలేని సమయంలో ఏమీ ఆశించకుండా కేవలం మానవత్వంతో, ఔదార్యంతో క్రిష్ణ కిడ్నీని సమర్పించుకున్నాడు. ఇరవై సంవత్సరాలుగా

మన కంపెనీలో నమ్మకంగా నాకు చేదోడు వాదోడుగా ఉన్నాడు. క్రిష్ణ తనకు తానుగా ముందుకి రాకపోయి వుంటే ఇప్పుడు నా పరిస్థితి ఎలాగుండేదో ఊహించగలమా? నా మూలంగానే క్రిష్ణకు మరణం సంభవించింది కదా!"

"ఎందుకు నాన్నా అస్తమానం మీ మూలంగా క్రిష్ణ చనిపోయాడంటారు? అలా జరగాలని ఉంది జరిగిపోయింది. దానిని మీమీద ఆపాదించుకుంటే ఎలా? అతని కుటుంబ బాధ్యత అంతా మనదేననీ, మన కుటుంబ సభ్యులతో సమానం అంటే ఎలా?"

"అదేరా నేను చేయగలిగేది! ఇక్కడ బాధ్యత కంటే ముఖ్యం సమస్యకు సరియైన శాశ్వత పరిష్కారం. కోర్టులో తీర్పులా కాదు. సంఘ తీర్పులా ఉండాలి. ఇంతకంటే సరియైన పరిష్కారం లేదు. నేను అన్నదే న్యాయమని నేను మనస్ఫూర్తిగా భావిస్తున్నా."

"ఏమైనా నాన్నా... లోకంలో లేనిది మీరు చేస్తున్నారనిపిస్తుంది! కొంత విరుద్ధమనిపిస్తుంది!"

"లేదురా శ్రీనూ! ఒక బాధ్యత కలిగిన మనిషిలా సాయం పొందిన సామాన్య మానవుడిగా ఆలోచిస్తే, ఇదే సరైన పరిష్కారంగా అనిపిస్తుంది. అలాగే చేస్తా."



"మీ ఇష్టం నాన్నా! ఈ ఆస్తి అంతా మీ స్వార్జితం. మీ పేరు మీదనే ఉంది. మీకెలా మంచిదనిపిస్తే అలా చేయండి. కానీ క్రిష్ణ మరణానికి మీరే కారణం అన్నట్లు బాధపడుతున్నారు. అది డాక్టర్ల నిర్లక్ష్యం కావచ్చు, లేదా అతని రాత కావచ్చు."

"ఒరే శ్రీనూ! అలా మాట్లాడకురా! బాధ్యతల నుండి తప్పించుకోవటానికి ఇంకొకరిపై నెట్టడం మంచిది కాదు. స్వీకరించాలి, నెరవేర్చాలి."

రామచంద్రరావుగారు పెద్ద ట్రాన్స్‌పోర్టు కంపెనీ యజమాని. ఆయన దగ్గర క్రిష్ణ ఇరవై సంవత్సరాలుగా మేనేజరుగా పనిచేస్తున్నాడు. చాలా ముందుచూపు వున్న మనిషి. చాలా నిజాయితీగా పనిచేసేతత్వం గలవాడు. నిస్వార్ధపరుడు. మంచిమనిషి. రామచంద్రరావుగారికి పూర్తి విశ్వాసపాత్రుడు. క్రిష్ణకు ఏ లోటు రాకుండా జీతభత్యాలు ఇస్తుంటాడు. సెలవులు, బీమా భద్రత, వైద్య ఖర్చులూ... బోనస్ వంటివి ఏ విధమైన తేడా లేకుండా ఉద్యోగ రక్షణ కల్పించారు. రామచంద్రరావుగారు ఎక్కడకు వెళ్ళినా తనతో సమానంగా క్రిష్ణను చూసుకుంటారు. కొంతకాలంగా రామచంద్రరావుగారి ఆరోగ్యం క్షీణించడం, షుగర్, రక్తపోటు ఎక్కువ కావటం, చివరిగా కిడ్నీ వ్యాధి రావడం జరిగిపోయింది. రెండు, మూడు నెలలుగా హాస్పిటల్లోనే ఉండి చికిత్స చేయించుకోవటం జరుగుతుండేది. కిడ్నీ మార్పిడి చేస్తే బాగుంటుందని డాక్టర్లు చెప్పడం, అయిన వాళ్ళెవరూ ముందుకు రాకపోవడం రామచంద్రరావుగారిని ఇంకా కుంగదీసింది. ఆ సమయంలోనే క్రిష్ణ ఒకరోజు రామచంద్రరావుగారి కిడ్నీతో తన కిడ్నీ సరిపోతుందేమో చూద్దా మన్నాడు. దానికి రామచంద్రరావుగారు ఒప్పుకోలేదు. ఆ ప్రయత్నం వద్దన్నారు. కాని క్రిష్ణ బలవంతంపై పరీక్ష చేయగా సరి పోతుందని తేలింది. ఆ విషయం తెలిసిన వెంటనే రామచంద్రరావుగారికి ఆశ్చర్యమేసింది. అది ఎలా సాధ్యమని! ఒక్కోసారి బయట వారి కిడ్నీ కూడా సరిపోతుందని, అది మీ అదృష్టమని డాక్టర్లు చెప్పారు. కాని రామచంద్రరావుగారు ఒప్పుకోలేదు. క్రిష్ణ భార్యాపిల్లలతో ఉన్నాడు. ఇంకా అతనికి బోలెడు భవిష్యత్ ఉంది వద్దని తిరస్కరించారు. కానీ క్రిష్ణ ఆరోగ్యానికేం ఢోకా వుండదనీ, ఒక్క కిడ్నీతో పూర్తి ఆరోగ్యంగా వుండవచ్చని డాక్టర్లతో రామచంద్రరావుగారికి నచ్చచెప్పించాడు. ఓ మంచి మనిషిని బతికించుకోవడం వల్ల పదిమందికి మంచే జరుగు తుందని క్రిష్ణ నిశ్చయించుకున్నాడు. ఆ తరువాత చకచకా ఆపరేషన్‌కి కావలసిన ఏర్పాట్లు అయిపోయాయి. ఆపరేషన్ రోజున క్రిష్ణ చాలా ఉల్లాసంగా, సంతృప్తిగా కనిపించాడు. తన కిష్టమైన వ్యక్తికి కిడ్నీ ఇవ్వటం తనకెంతో ఆనందదాయకంగా, అదృష్టంగా భావించి సంతోషంగా ఆపరేషన్ థియేటర్‌లోకి వెళ్ళాడు. ఆపరేషన్ మూడుగంటలు పైగా పట్టింది. అంతా బాగానే అయిందన్నారు. రామచంద్రరావుగారిని ఐ.సి.యు.లోకి తీసుకువచ్చారు. బాగానే ఉన్నారు. కానీ క్రిష్ణ మత్తులో నుండి ఇంకా బయటకు రాలేదు. డాక్టర్లందరూ కంగారుగా ఏదో చేస్తున్నారు. ఏమైందని అడిగితే క్రిష్ణ మత్తులో నుండి బయటికి రాలేదనీ, చికిత్స చేస్తున్నారనీ అన్నారు. కానీ అలా రెండు గంటలకు పైగా ప్రయత్నం చేశాక అనస్థీషియా షాకు వల్ల క్రిష్ణ చనిపోయాడని చెప్పారు.

"నాన్నా! విశ్వం ప్లీడరుగారు వచ్చారు. నేవెళ్ళి తీసుకొస్తా నుండండి" అని ప్లీడరుగారిని లోనికి తీసుకువచ్చాడు శ్రీను. రామచంద్రరావుగారు ఆయన్ని గౌరవంగా ఆహ్వానించారు.

"దేనికి అర్జెంటుగా రమ్మన్నారు? కొంచెం ఆలస్యం అయింది. క్షమించాలి."

"మీరు మాకు ప్లీడరే కాదు, కుటుంబ సభ్యులతో సమానం. మీకు తెలియకుండా మేము ఏ నిర్ణయం తీసుకోం కదా."

అదంతా మీ ప్రేమ. నా అదృష్టం.

"ప్లీడరుగారు! నేను ఒక గట్టి నిర్ణయానికి వచ్చి మిమ్మల్ని పిలిపించడం జరిగింది."

"ఇంతకీ విషయం చెప్పండి."

"ఆ మధ్య నాకు మరొకరి కిడ్నీ అమర్చారు కదా. ఆ కిడ్నీ దానం చేసిన త్యాగపురుషుడు క్రిష్ణ చనిపోవడం జరిగింది. తెలుసు కదా?"

"అవును విన్నాను. అతని పెద్ద మనసుకు చేతులెత్తి నమస్కరించాలి."

"అతని రుణం ఏ విధంగా తీర్చుకోవాలి. అతనికి ఏ విధంగా నివాళి అర్పించాలి అన్నదే సమస్య. నా మూలంగా క్రిష్ణ కుటుంబం నట్టేట్లో పడినట్లయింది. ఆ కుటుంబానికి పూర్తి ఆర్థిక రక్షణ, వారి జీవితాలు పూర్తిగా కుదుట పడేవరకు ఏమి చేయాలి? ఎలా చేయాలి? అనేది విషయం. అందుకని నా యావదాస్తిలో నా కుటుంబ సభ్యులతో సమానంగా క్రిష్ణ కుటుంబానికి పంపకాలు అయిపోవాలి. అతని భార్యకు, పిల్లలకు ఏ లోటు రాకూడదు. దానికి సంబంధించి రాత కోతలన్నీ చేసి వెంటనే రిజిష్టరు చేయించి ఆ పత్రాలు వాళ్ళకు అంద జేయాలి. అదే క్రిష్ణకు సరైన నివాళి అని అనుకుంటున్నాను."

విశ్వంగారు ఆశ్చర్యపోతూ, సంతోషిస్తూ.. సంతోషంగా ఆ పనినంతా పూర్తిచేశారు.

**(నా వైద్య వృత్తిలో జరిగిన సంఘటన ఆధారంగా)**

# మనిషి - ప్రకృతి

- ఎస్.బి.ఎస్. మౌళి



చెట్టు నీడలు
ఒకదానిలో ఒకటి చొచ్చుకుపోతున్నాయి
ఒకరి మనసుని ఒకరు అర్థం చేసుకోవటం
నీడల నుంచే
నేర్చుకోవాలేమో మనం!

సన్నటి గరిక తీగెలు
ఆప్యాయతతో ఒకదానికొకటి అల్లుకు పోతున్నాయి
మట్టి పొరలను తనివితీరా ముద్దాడుతున్నాయి
'ఆత్మ సంతృప్తి' అంటే ఏమిటో
వాటిని స్పృశిస్తేనే తెలుస్తుందేమో మరి!

జొన్న కంకులకు
దిష్టి బొమ్మలు
పహారా కాస్తున్నాయి
లేనిదాంట్లో వుందనిపించటం
తను తప్ప అంతా గుడ్డిదనుకోవటం
యుగయుగాలుగా మనిషి అలవాటు చేసుకొన్న ఒక నమ్మకం లాగుంది!

ఎండిన ముళ్ళకంచెపై
రెండు పెంకు పురుగులు
ఒకదానిపై ఒకటి కత్తులు దూసుకుంటున్నాయి
నాకిదంతా పట్టదని చోద్యం చూస్తూ నిలబడింది
మచ్చల తొండ
ప్రపంచం ఏమైపోతే నాకేమనుకునే
మనిషి మూర్ఖపు ఆలోచనను ప్రతిబింబించే జీవం లేని స్టాట్యూ అది!

తాబేలు
తన తలను లోపల లోపలకు లాక్కుంటుంది
ఇప్పుడు లోకంలో రాజ్యమేలుతున్న మాయాజాలాన్ని
ముందే పసిగట్టిన మేధావి అది.
అందుకే
కళ్ళను నిరంతరం చుట్టుతా వదిలిపెడుతుంది.
కాళ్ళను కొద్దిగా నిదానంగా కదులుస్తుంది.
మారుతున్న ప్రపంచం తన జీవితాన్ని శాసిస్తుందేమోననే
భయం కూడా వెన్నంటే వుంది!

మంచులో తడిసిన తూనీగ
తన రెక్కల ముడిని తానే విప్పుకోలేక పోతుంది.
ఎవరైనా వచ్చి ఆదుకుంటారని ఆశగా చూస్తోంది.
అంతట్లోనే పైరుగాలి సుతారంగా తాకి వెళ్ళిపోయింది.
ఇప్పుడు తూనీగ
తనలా ఆటంకాలలో ఇరుక్కున్న వారి జీవితముడులను
విప్పడమనే మహోధ్యేయంతో లోకాభ్యుదయానికి
పయనం కట్టింది!

మనిషి
తన లోపలికి తాను
తనది కాని శరీరంలోకి కూరిపోతున్నాడు.
మనిషిని
మనిషిగా తీర్చిదిద్దాలనే లక్ష్యంతో మళ్ళీ మళ్ళీ పురుడు
పోసుకుంటున్న ప్రకృతి పరమార్థం ఇది కాదు!
తన చిటికెన వ్రేలిని అందించి తన వెనకాలే
చంటిపాపలా తిప్పించుకోవాలని దాని కోరిక!
గుండెలపై వేసుకొని ఊయల ఊపాలని దాని నిరంతర ఆశ

---

# జగతీకరణం

- గుండాన జోగారావు



మట్టి సుగంధాల్ని ఆస్వాదిస్తూ
నేలతల్లి గుండెలపై సేదతీరే రైతు
నేడు రూకల కట్టల మధ్య
నిద్రరాక సతమతమవుతున్నాడు....
అవును మరి.... అతని భూమి
ప్రత్యేక ఆర్థిక మండలి పేరిట
కమండల జల వశీభూతమై
పంచ రంగుల కలల వంచనలో
కొట్టుమిట్టాడుతోంది....
భూదాతలకు కర్మాగారాల్లో
ఇంటికొకరికి ఉద్యోగమని
ఊరించారు... ఊహల్లో ఊరేగించారు....

ప్రతీ కుటుంబ చిత్రపటాన్ని
ఊరు రూపురేఖల్ని మార్చేస్తామన్నారు...
చిత్రంగా బ్రతుకు పుస్తకాన్నే చింపేసారు.
కర్మాగారాలు ఎప్పుడొస్తాయో తెలియదు కానీ
రైతుల భవితని కారాగారంలోకి తోసేసారు...
వరాలమాట దేవుడెరుగు...
పచ్చని పొలాలు క్షవరాలకు గురయ్యాయి...

రైతులు రైతు కూలీలుగా మారినా
కష్టజీవికి పనిలేకుండా పోయె...
ముందస్తు రూకల కట్టల మత్తు మందులో
సరదాలకు తీసిన పరదా
బురదై వరదై పారింది...
ముందుచూపు లేని మందు చూపుకు బలైంది.
దురద వ్రణమై రుణ రాకాసి పుండయింది..
బడుగు జీవితాల్ని
ప్రభావితం చేసిన జగతీకరణం..
తిలకాలు దిద్దుకున్న ఫలకాలు
ఉలకక పలకక స్తబ్ధావస్థలో..
నేడు... పేదవాడి అస్తిత్వానికి
త్రిశంకు స్థాపన!

ఆధునిక ఇటలీ కవులు

- సౌభాగ్య



# సాల్వెటోరీ క్వాసిమోడో

సాల్వెటోరీ క్వాసిమోడో సిసిలీ ద్వీపంలోని మోడికాలో జన్మించాడు. అక్కడే టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ ఇంజనీరింగ్ చదివాడు. 1919-26 మధ్య రోంలో వున్నాడు. గ్రీకు, రోమన్ లిరికల్ పొయెట్స్‌ని అధ్యయనం చేశాడు. ప్రభుత్వ ప్రజా సంబంధ శాఖలో 1926 నుండి పనిచేశాడు. 1929 తరువాత ఫ్లోరెన్స్‌లో నివసించాడు. సార్డీనియా పర్యటించాడు. 1934 నుంచి మిలాన్‌ని స్థిరనివాసం చేసుకున్నాడు. గ్రీకు లలిత గీతాల్ని, ఇటాలియన్ భాషలోకి అనువదించి 1940లో అచ్చేశాడు. వాటివల్ల అతనికి గొప్ప పేరు వచ్చింది. 1941లో మిలాన్ ఇటాలియన్ సాహిత్యాచార్యుడుగా నియమింపబడ్డాడు. ఫాసిస్టు వ్యతిరేక కార్యకలాపాల వల్ల జైలుపాలయ్యాడు. యుద్ధానంతరం రష్యా పర్యటించాడు. పర్యటనలో వుండగా గుండెపోటు వచ్చింది. చాలాకాలం మాస్కో ఆసుపత్రుల్లో వుండి చికిత్స పొందాడు.

1959లో నోబుల్ అవార్డు స్వీకరించడానికి స్టాక్‌హోం వెళ్ళాడు. ఆక్స్‌ఫర్డ్ తదితర విశ్వవిద్యాలయాలు, గౌరవ డాక్టరేట్లు ప్రదానం చేశాయి. నోబుల్ అవార్డు అందుకున్నాక విస్తృతంగా యూరప్ అంతటా పర్యటించాడు. 1968లో తీవ్రమైన గుండెపోటుతో సిసిలీ ద్వీపంలో కన్నుమూశాడు.

క్వాసిమోడో నోబుల్ అవార్డు అందుకున్నాకా అంతర్జాతీయ ఖ్యాతిని పొందాడు. ఆయనకు ముందు యాభై ఏళ్ళలో సాహిత్యంలో ఏ ఇటలీ కవికీ నోబుల్ అవార్డు రాలేదు. యూరోపియన్ సాహిత్య చేతనలో ఆయన భాగస్వామ్యం ఎంతో విలువైనది.

పద్దెనిమిదేళ్ళ వయసులో సిసిలీ ద్వీపం నుంచి ఇటలీ వచ్చి ప్రవాసం నుంచి వచ్చి తన మాతృభూమిని సందర్శించానన్న సంతోషంతో కవితలల్లాడు. ఆ ప్రేరణతోనే గ్రీకు, రోమన్ ప్రాచీన కావ్యాల అధ్యయనం చేసి మధ్యధరా, ప్రాంత సంస్కృతి గురించి తెలుసుకున్నాడు. తన పునాదుల్ని తెలుసుకునే తపనలో తన తొలి కవితలో..

"భూమిపైన నివసించే ప్రతి మనిషీ ఒంటరివాడే!

సూర్యకిరణాన్ని అనుసరించి తన ఇంటిని కనిపెట్టే ప్రయత్నంలో సాగుతాడు!

హఠాత్తుగా అతనికి సాయంత్రం ఆహ్వానం పలుకుతుంది"

అంటాడు.

ఇంకో కవితలో "స్మృతుల్లో మెదిలే నీరు వలయాలు వలయాలుగా విస్తరిల్లినట్లు

నా హృదయం ఒక కేంద్రం నుంచి మరో కేంద్రానికి కదుల్తుంది, ఆగిపోతుంది

నిశ్చలంగా నిలబడిపోయిన నిర్మల జలమా!

నా హృదయం నీ సోదరిగా మారుతుంది' అంటాడు. ఆయన తొలి కవితల్లో ఏకాంతం, ప్రశాంతం కనిపిస్తాయి.

బాహ్య ప్రపంచం ఎప్పుడూ ఏవో వుపహారాల కోసం వూరిస్తూ వున్నట్లు వాటి పట్ల ఆయనకు అంతగా ఆసక్తి లేనట్లు అనిపిస్తుంది. సిసిలీ ప్రకృతి ఎప్పుడూ ఆయన భావాల్లో మెదుల్తూ యాంత్రికత నించీ ఆయన్ని రక్షిస్తున్నట్లు తోస్తుంది. సహజమైన ప్రకృతి ఆయనకు సమున్నతమైన ఉత్సాహాన్ని ఇచ్చినట్లు అనిపిస్తుంది.

ప్రకృతిని ఆయన తనకు సన్నిహిత మిత్రుడిగా భావించాడు.

'గాలి'తో తాను గాఢమైన అనుబంధమున్నవాడుగా చాలా కవితల్లో చెప్పుకున్నాడు. ఆయన ఆనందానికి భూమి, నీరు, గాలి మౌలిక ధాతువులుగా ప్రేరణ కలిగించినట్టు ఆయన కవితలు చెబుతాయి.

'ప్రాచీన శీతాకాలం' అన్న కవితలో ఆయన అనందపు అంచుల్ని ప్రదర్శిస్తాడు.

'తుషారం నిషాలా సాగింది

పక్షుల గడ్డి పరకల్ని ముక్కున కరచుకుని తిరుగుతున్నాయి

హఠాత్తుగా పొగమంచు ప్రవాహంలా కమ్ముకొచ్చింది

మంచు బిందువులు మనసు నుంచీ వచ్చిన మాటల్లా రాల్తున్నాయి

చిన్ని సూర్యుడు మొలిచాడు, స్వర్గ ద్వారంలా ఆకర్షిస్తున్నాడు

ఈ ఉదయంలో, ఈ ఉల్లాస ఉదయంలో మనల్ని, వృక్షాల్ని

గాలిని, మంచు ముంచేసింది'

అంటూ మనిషికీ, ప్రకృతికీ మధ్య వున్న విడదీయరాని బంధాన్ని విహ్వలానందంతో వర్ణిస్తాడు.

'నీరసించిన పువ్వు అప్పుడే కొమ్మల నుండీ పైకి లేచింది, ఎగిరింది




నేను ఓర్పుగా గమనిస్తున్నాను
తిరిగి రాని దాని గమనం కోసం తీరుబడిగా
ఎదురుచూస్తున్నాను!
అంటూ రాలుతున్న పువ్వుల్లో రాగాలు చూస్తాడు.
'పువ్వుల్లో మృత్యువు నిద్రిస్తోందంటాడు చిత్రంగా!
'రక్తం చేసే రంగుల క్రీడ కవిత్వ'మంటాడు
ఆశ్చర్యంగా!'

1967లో వచ్చిన 'డెబిట్ అండ్ క్రెడిట్' అతని చివరి కవితా సంపుటి. ఆయన జ్ఞానం, పరిణిత దశ ఈ కవితా సంపుటిలో చూడగలం.

దేశ దేశాలు పర్యటించిన ఆయన కొన్ని అనుభవాల్నీ ఏకాంత హృదయంతో అనుశీలించాడు. ఆలోచనకన్నా అనుభూతే ఆయన కవితల్లో కనిపిస్తుంది.

'బహుశా నేను ఎప్పుడూ చనిపోతూనే వున్నాను
అయినా ఇప్పటికీ ఆసక్తిగా, జీవితం చెప్పే పాఠాల్ని వింటున్నాను
కానీ ఎప్పుడూ అవి నాకు అర్థమే కాలేదు'
అంటూ పసి హృదయంతో వాపోతాడు.

ప్రాచీన గ్రీకు రోమన్ కవితా శక్తుల్ని ఆధునిక యూరోపియన్ అనుభూతుల్తో అనుసంధానించగలిగిన, సహజత్వంతో పరిమళించిన మహాకవి క్వాసిమోడో.

## నా కాలం మనిషి

నువ్వింకా, రాతి యుగంలో రాతి గదల్తో వున్నావు
నా కాలం మనిషీ!
నువ్వు కత్తుల్తో దాడి చేసే కోడిపందేల రంగస్థలంలో వున్నావు
రెక్కల్లో దాచిన కత్తుల్తో మరణపు నీడలో మందహాసం చేస్తున్నావు
నేను నిన్ను చూశాను
అగ్ని రథంలో, వురికొయ్యకు వేళ్ళాడుతూ
చిత్రహింసల చక్రంతో తిరుగుతున్న నిన్ను చూశాను
నేను నిన్ను చూశాను
అవును. సైన్సు వినాశనాన్ని విస్తృతంగా బోధించడం చూశాను
ప్రేమా లేదు, ఏసుక్రీస్తు లేదు
ఎప్పుడూ నువ్వు చంపుతూనే వున్నావు
మీ నాన్న చంపినట్లు
నిన్ను మొదటిసారి చూసిన జంతువు మరణానికి లొంగినట్టు
చంపుకుంటూ పోతున్నావు
రక్తాన్ని వాసన చూసినట్లు ఒక సోదరుడు యింకో సోదరుడితో అంటున్నాడు
"మనం పొలాల్లోకి పోదాం! మైదానాల్లోకి పోదాం!
అరణ్యాల్ని ఆక్రమిద్దాం!"
ఆ మాటలు ప్రతిధ్వనించాయి
చల్లగా బలంగా నీదాకా వ్యాపించాయి
బిడ్డలారా! మరచిపోండి!
రక్తమేఘాలు భూమినించీ పైకి లేచాయి
తండ్రుల్ని మరచిపోండి!
వాళ్ళ సమాధులు బూడిదలో దిగబడిపోయాయి
నల్ల పక్షులు, గాలి వాళ్ళ హృదయాల్ని కప్పేశాయి

## సన్యాసి దగ్గరున్న పాత్రల రూపాంతరం

వాటితో బాటు మరణించిన వాళ్ళు పరిణితి చెందుతారు
నా హృదయం కూడా మారుతుంది
ఆత్మన్యూనత ఒక్కటే ప్రపంచానికి మిగిలిన చివరి హాస్యం
గాజుపాత్రలో నీటి వృక్షాల నీడలు కదుల్తాయి
చీకటి పరివర్తన నన్ను చిత్రవధ చేస్తుంది
అజ్ఞాత సన్యాసి
పచ్చని గింజల్ని పది దిక్కుల్లో చల్లితే
అది నిస్సహాయంగా రోదిస్తాయి
నా ముఖమే వాటి వసంతం
బావి గోడల పునాదుల్లో చీకటి స్మృతులు జన్మిస్తాయి
మృదంగాల్ని ప్రతిధ్వనులు పాతిపెడతాయి
నేను మిగిలిపోయిన జ్ఞాపకంలా మినుకు మినుకుమంటాను

## నగరంలో

ఈ నగరం దగ్గర ఒక యంత్రముంది
అది కలల్ని పొడి పొడి చేస్తుంది
పొడిచేస్తుంది
అది ఎంత వేగంగా చలిస్తుందంటే
మనం కలల్ని కోల్పోయామన్న సంగతి గుర్తించలేం
ఉనికి వూపిరి కోల్పోయిన విషయాన్ని గమనించలేం
ఆకలి అగ్నిజ్వాలల నీడల్లో
భాస్వరంలా మండిన బాధలో
పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న పొగల్లో
అల్లకల్లోలంగా అల్లుకున్న సముద్రం నాచులో అల్లాడుతాం
అక్కడక్కడా శంఖం లాంటి యిళ్ళలో
బృహదాకారాలు భయం కలిగిస్తూ కదుల్తాయి
ఉల్లాసంగా ఊళలేస్తాయి
ఆడుతూ, పాడుతూ, కేరింతలు కొడుతూ
చెత్తా చెదారం మన మీద విసురుతాయి
ఐనా బతక్క తప్పదు
బాధపడకా తప్పదు




- సాల్వెటోరీ క్వాసిమోడో

# సెమటకాయ!!

- కందాళై రాఘవాచార్య



అమ్మో! నాయినో! ఈపు మీద ముండ్ల కంప మొలిసినట్లు
ఒకటే గులగుల
సెట్టంత సెమటకాయ కాసిందే అవ్వ
గోర్లు పెట్టి గీకరాదే
గోడకు బఱ్ఱెలెక్క ఈపురాస్తున్నా!

బిడ్డా! దొరలకున్నట్లు పౌడరుయాడిది
ఒక్కసారి కుంటల మున్గి ఈతకొట్టు
ఈపు సల్లబడ్తది కూలరు లెక్క

ఎండాకాలం అన్నాకా మామిడి కాయలు కాసినట్లే
సెమటకాయ కాసుడూ నివద్దే
పోరల ఈపులు గోకిగోకి నా గోర్లూసి పోతున్నెగని సెమటకాయ
రాలిపోత లేదు
ఎన్నంత ఎఱ్ఱెఱ్ర దద్దుల తోటి వాపచ్చి మండవట్టి
ఈపుమీదికి సూర్యుడు దిగచ్చి ఆడుకున్నట్లున్నది
ఎండల పనిచేసేటోల్లకు ఈపుమీద సెమటకాయ కాకుంటే
ఐసుముక్కలు ఐతయా
గరంకు సెమట కాస్తది
సినుకు పడితే రాలిపోతది
తాతల కాలం నించి ఇంతే కథ
తమాయించుకో బిడ్డా
ఏడ్చి ఏడ్చి గరంగాకు
కుత్కెలు పడ్తే కుండెడు కుండెడు నీళ్లు యాడినించి తేవాలే!
బాంచను
ఏడ్వకు! ఈపు ఎప్పటి లెక్కనున్నగైతది కొడుకా
సల్లదాగు సల్లదనం
యాపసెట్టు కింద సల్లగాలికి
నులుక మంచం మీద కునుకు దీయు పో

# లోలోతుల్లోకి ఈదుకుంటూ....

- ద్యావరి నరేందర్‌రెడ్డి



మనసు మహాసముద్రమంత లోతు!
అత్యాశల అలలు
ఈర్ష్యాద్వేషాల నురగలు
అహంభావాల సుడులు
అంతేనా... ఇంకా చూడు
మనసు పై పొరల్ని దాటుకుంటూ
లోతుల్లోకి లోలోతుల్లోకి ఈదుతుంటే
పగడపు దీవులు ముత్యాల రాశులు
ఎన్నెన్నో అందాలు... ఎన్నెన్నో అద్భుతాలు!
జీవితం భ్రమకాదు... ఒక సత్యం
ఎవరొప్పుకున్నా ఒప్పుకోకపోయినా
సత్యం కాలానికతీతంగా సత్యమే!
మనిషిగా జన్మించి గానుగెద్దులా
కాలం చుట్టూ తిరగడమే బ్రతుకంటే ఎలా!
నిరంతరాన్వేషణలోనే సత్యావిష్కారం –
అలలకు భయపడి ఇసుకలోనే నడుస్తామా!
నురగలను రుద్దుకొని అస్తిత్వాన్ని కోల్పోతామా!
నిర్లక్ష్యంతో సుడులలో చిక్కుకొని కూరుకుపోతామా!
పైపైన వెతుకులాట కాలాన్ని హరించి వేస్తుంది
నిర్లిప్తత బ్రతుకును నిర్వీర్యం చేస్తుంది
జ్ఞాన చక్షువును తెరిచి
మనోగర్భాన్ని తరచిచూస్తే
లోలోతుల్లోన అఖండమైన దివ్యతేజస్సు!
దర్శించినంతనే బ్రహ్మానందానుభూతి!
అంతరంగ ఆంతర్యం తెలుసుకున్నవేళ
మనిషే బ్రహ్మం
మనసే స్వర్గం

# నానీలు

- తాటికొండ మాధవి



పల్లెని పీకి
ప్రాజెక్టు కడతావా!
ప్రకృతా మజాకా..
గాలితో కూల్చేస్తుంది!!

నీళ్ళమీదిప్పుడు
కార్పొరేట్ కళ్ళు!
జాగ్రత్త ఎప్పుడో
గంగమ్మ పీకేస్తుంది!!

వాహనాన్ని నడిపించే
పెట్రోలు....
ఉన్నట్టుండి మనిషికే
ఎసరు పెడ్తోందే!

నీరు ఇప్పుడు
ప్రైవేటు పరం
తానుగా సర్కారు
వేటు వేయలేక

అక్షర సత్యాలతో
మానవ మేధను
మేల్కొల్పుతున్న
నానీ... నీకు జోహార్!

## చిన్న కథ

# జీవితం

- పుప్పాల కృష్ణమూర్తి



ఒక జమిందారు వద్ద ఆల్సేషియన్ కుక్క ఉండేది. దాన్ని పగలల్లా తోటలో కట్టేసి, రాత్రి పూట భవనం ఆవరణలో వదిలిపెట్టేవారు. ఓ పగలు మామిడి చెట్టు కింద నిద్రపోతుంటే కోతి వచ్చింది పండ్లు వెదుక్కుంటూ. దాన్ని చూసి భౌ...మంటూ మొరిగింది.

"మొరగకు. పొద్దునే ఏవన్నా తిన్నావా? లేదా? అరుపు నీరసంగా వస్తోంది" అడిగింది కోతి.

"లేదింకా. మా యజమాని జీతగాడు రావాలి. ఆహారం పెట్టాలి."

"ఎప్పుడైనా చికెన్ బిర్యానీ తిన్నావా?"

"లేదు. వారానికోసారి ఎద్దు మాంసం మాత్రం పెడతారు."

"పోనీ, పట్నం ఎప్పుడైనా చూశావా?"

"నాకేం పని, మా యజమాని ఎప్పుడైనా తీసుకుపోతే చూస్తా."

"సరే... మీ అమ్మను, తమ్ముళ్ళను ఎప్పుడైనా కలుసుకున్నావా?"

"ప్చ్... వదిలొచ్చి ఐదేళ్ళవుతోంది. ఇంతవరకూ కలవలేదు. ఎక్కడున్నారో ఏమో?"

"నీకిక్కడ స్నేహితులు ఎవరన్నా ఉన్నారా?"

"అస్సలు లేరు. మా యజమాని, నన్ను ఎవరితోనూ కలవనివ్వడు. ఆ ఇల్లు, ఆ ఇంటిలోని మనుషుల తోడిదే లోకం."

"కోరుకున్న తిండి తినలేవు. వెళ్ళాలనుకున్న చోటుకు వెళ్ళలేవు. చూడాలనుకున్న తల్లిని చూడలేవు. స్నేహితుల్ని కలవాలన్నా, మీ యజమాని దయ. చూడ్డానికి నున్నగా, బలంగా వున్నావు కానీ నీకు ప్రపంచ జ్ఞానం తక్కువ. ఎంత దుర్భరమైంది నీ బతుకు. కోటి రూపాయలిచ్చినా, నీ బతుకు మేము బతకలేము. ఉంటే తింటా. లేకుంటే పడుకుంటా. కాని ఎప్పుడంటే అప్పుడు, ఎక్కడికంటే అక్కడకు వెళ్ళిపోతా. ఏం చేయాలనుకుంటే, అది చేస్తా, నా వెంట వచ్చేయ్. నీకు కొత్త ప్రపంచాన్ని చూపిస్తా" అంది కోతి.

"సరే. అలాగే వస్తా కానీ, నాకు ఆహారం ఎవరు పెడతారు?"

"స్వేచ్ఛాజీవులకు ఆహారం ఎవరూ పెట్టరు. బానిసలకే ఎవరో ఒకరు పెడతారు. మనమే కష్టపడి సంపాదించుకోవాలి. అవసరమైతే దొంగతనం చేసైనా కడుపు నింపుకోవాలి."

"అమ్మో, ఆకలికి నేను తట్టుకోలేను. దొంగల్ని పట్టుకునే నేను, దొంగతనం చేయడమా? నువ్వు చేసినా చెట్టో, గుట్టో ఎక్కి తప్పించుకుంటావు. కానీ, నేను తొందరగా దొరికిపోతాను. కాబట్టి నాకు నీ బతుకొద్దు. నాకిలాగే బాగుంది" అంది.

"కొన్ని జీవులంతే. వాటికి తిండి ఉంటే చాలు. ఏ స్వేచ్ఛా అవసరం లేదు. వినోదం, వికాసం, విజ్ఞానం, చివరకు శారీరక సుఖాలు కూడా త్యాగం చేస్తాయి" అనుకుంటూ వెళ్ళిపోయింది కోతి. •

# ఊరి ప్రజల పదబంధాలే నా రచనల్లో జీవం నింపాయి

**- పొన్నుసామి**



మధురైలో జరిగిన తమిళ అభ్యుదయ రచయితల, కళాకారుల మహాసభలలో పొన్నుస్వామితో కె. ఆనందాచారి

సెప్టెంబరు *16, 17, 18* తేదీలలో తమిళనాడు అభ్యుదయ రచయితల, కళాకారుల 12వ మహాసభ 'విరుధునగర్' జిల్లా కేంద్రంలో జరిగింది. ఇందులో సౌహార్ద ప్రతినిధిగా వెళ్లిన నాకు అక్కడి ఎంతో మంది కథా రచయితలను కలుసుకుని, వారితో మాట్లాడే అవకాశం కలిగింది. విరుధునగర్ జిల్లాలోని ఒక మారు మూల గ్రామంలో పెద్దగా చదువుకోని ఒక గొప్ప కథా రచయిత పొన్నుసామి. మిరియాలు, ఆవాలు, జీలకర్ర మొదలైన వంటింటి చిల్లర వస్తువులను అమ్మే బడ్డీ కొట్టు నడుపుకొంటూ దాదాపు మూడు వందల కథలకు పైగా రాసారు. సాహిత్య అకాడమీ అవార్డు పొందిన సృజనశీలి, నిబద్ధుడు, నిరాడంబరుడాయన. ఆ సభలలో పాల్గొన్న ఆయనను ప్రస్థానం కోసం ఇంటర్వ్యూ చేసాను. ఆ ఇంటర్వ్యూలోని కొన్ని విషయాలను మీ ముందుంచుతాను.

**- కె. ఆనందాచారి**

**నేను :** పొన్నుసామి గారు నమస్కారం. మీరు ఎప్పటి నుండి రాస్తున్నారు? మీ ఊరు, నేపథ్యం చెబుతారా?

**పొన్నుసామి :** నమస్కారం, నేను 1972 నుండి కథలు రాయడం మొదలుపెట్టాను. ఆ సంవత్సరం సెప్టెంబరు నెలలో ఒక కథ రాసి 'సెమ్మలర్' మాసపత్రికకు పంపాను. దాని పేరు పరీక్ష (**prize**) మొదటి కథ అది అచ్చయింది. ఇక నేను ఈ విరుధునగర్ జిల్లాలోని 'మేలాన్ మరైనాడ్' అనే చిన్న మరియు అతి పేదలుండే గ్రామంలో పుట్టాను. అక్కడే పెరిగాను. అక్కడే వుంటున్నాను. చిన్నప్పుడే అమ్మనాన్నలు చనిపోయారు. అమ్మమ్మ పెంచింది. ఆమె కూడా అంగవికలురాలు. నాకొక తమ్ముడూ వున్నాడు.



పొన్నుసామి

**నేను :** మీరేమి చదువుకున్నారు?

**సామి :** ఐదవ తరగతి వరకు చదివాను. కుటుంబ బాధ్యతలతో ఇక చదవటం కుదరలేే. ఊర్లో చదువుకోలేదని, చదువురాదని అందరూ నన్ను గేలి చేసేవారు. అందుకే అన్ని పత్రికలు చదవడం మొదలు పెట్టాను. ఎక్కడ ఏది దొరికితే అది చదివాను. అంతేకాదు ఆ రోజుల్లో సోవియట్ నవలలు, కథలు మా ఊర్లోకి వచ్చేవి అవన్నీ చదివాను.

**నేను :** మీకు కథలు ఎందుకు రాయాలనిపించింది?

**సామి :** పత్రికలో ఒకసారి ఒక వార్త వచ్చింది అదేమిటంటే, తంజావూరులోని వెన్మణి ప్రాంతంలో 1969లో అక్కడి వ్యవసాయ కార్మికులు తమ కూలి పెంచాలని కోరుతూ సమ్మె చేశారు. అక్కడి భూస్వామికి కోపం వచ్చింది. నాపైనే పోరాటం చేస్తారా ఈ అలగాజనం అని అనుకొని కార్మికులందరూ గుడిసెల్లో నిద్రపోతూ వుండగా అర్ధరాత్రి గూడేనికి నిప్పుపెట్టి కాల్చాడు. ఆ సంఘటనలో నలభై ఎనిమిది మంది చనిపోయారు. ఆ ఘటన నన్ను కదిలించింది. ఆ ఘటనపై కథ రాసాను. ఈ సంఘటనే నాకు ప్రేరణగా నిలిచింది. శ్రామికుల బాధలను, గాధలను చెప్పాలనే కథలు రాయటం మొదలుపెట్టాను. తమిళంలో గొప్ప అభ్యుదయ రచయిత జయకాంతన్ నవలలు చదివాను. అవి నన్నింకా ప్రేరేపించాయి. శ్రామికుల పక్షాన వుండాలని, వారిగురించిన కథలు రాయాలని అప్పటి నుండి ఇప్పటి వరకూ అదే నిర్ణయంలో వున్నాను.

**నేను :** ఇప్పటి వరకు ఎన్ని కథలు రాసారు?

**సామి :** ఇప్పటికి యిరవై ఎనిమిది కథా సంకలనాలు వేశాను. సుమారు మూడు వందల కథలు వుంటాయి. ఆరు నవలలు రాశాను.

నేను : ఎక్కువగా చదువుకోలేదు కదా. భాష, వర్ణన ఎలా సాధ్యమయ్యింది.

**సామి :** నా గ్రామంలో వున్న భాష, చాలా సహజమైనది. ఇదే నేను చేసే రచనకు ఆధారం. ఊరి ప్రజల సహజ సిద్ధమైన, కల్మషం లేని ఏ రకమైన మాయలు, మర్మాలు లేని జీవన విధానం, వారు మాట్లాడే తీరు, వారు ఉపయోగించే పదబంధాలే నా రచనకు జీవాన్ని ఇస్తున్నాయి. ఆ Nativeness యే నా కింత పేరు తెచ్చింది. ఇప్పటికి చాలా తక్కువ డబ్బులతోనే మా గ్రామంలో బ్రతకగలుగుతున్నాం.

**నేను :** ఏ విషయాలపై ఎక్కువగా రాసారు? దళిత సమస్య, స్త్రీ సమస్యలపై రాసారా?

**సామి :** ఊహించి ఏదీ రాయను. కళ్లతో చూసిన అంశాలపైనే రాశాను. ముఖ్యంగా వ్యవసాయ కార్మికుల జీవితాలను గురించి, చిన్న రైతుల గురించి రాసాను. వారి గురించి రాయడం అంటే దళితుల గురించి రాయడమే. నా కథల్లో దళిత జీవితం బాగా వుంటుందని పరిశోధన

## పంజా

- పి.లక్ష్మణ్ రావ్



చిన్నప్పుడు చదువుకున్న
జానపద కథల్లోని ఒంటి కన్ను రాక్షసుడు
నిన్నటి వరకూ వెంటాడుతూనే ఉండేవాడు
కథానాయకుడ్ని ముప్పతిప్పలు పెట్టి
చివరాఖరకు ఓడిపోయి భస్మమైనా
ఇంకా భయపెడుతూనే ఉండేవాడు!

యవ్వనంలో చదివిన డిటెక్టివ్ నవల్లో
విలన్‌వేసిన ఎత్తులూ జిత్తులూ
ఇంకా బెదరగొడుతూనే ఉండేవి.
హీరో వాటిని చిత్తు చేసినా
నిన్నటివరకూ గాయపరుస్తూనే ఉండేవి!

మరొక నవల్లోని
కాష్మోరా అదేపనిగా పీడిస్తుండేది

ఎన్ని తులసీదళాలు వాడినా
సీసాలో బందీ అయ్యేదే కాదు!

కాని ఆశ్చర్యం!!
నేటి ప్రపంచీకరణ పిడిగుద్దులతో
ఒంటికన్ను రాక్షసుడంటే భయంపోయింది
విలన్ వేసిన నక్క జిత్తుల
మర్మం అర్థమైపోయింది
కాష్మోరా గిలగిలా కొట్టుకొని
కాళ్ళమీద పడిపోయింది!

ఇప్పుడు ప్రపంచీకరణే
వీటన్నింటికంటే పెద్ద భూతం!
బతుకుల్ని బతకనివ్వకుండా చేస్తున్న
ఈ మహమ్మారి నుండి
మనిషిని మార్కెట్‌లో సరుకుని చేస్తున్న
ఈ మాయలాడి నుండి
అగ్గిలేకుండా నిలువునా దహించేస్తున్న
ఈ అసుర శక్తి నుండి
కాపాడుకోలేక క్షణక్షణం క్షీణిస్తూ
విగత జీవులమై పోతున్నాం

భయాలతో నైనా బతకొచ్చుగాని
గ్లోబల్ ఉక్కు కౌగిలికి బలైతే
బతికి బట్ట కట్టలేం!
బహుపరాక్!

---

పత్రాలు కూడా సమర్పించారు. శ్రామిక మహిళా జీవితమే నా రచనల్లో వుంటుంది.

**నేను :** మీకు వచ్చిన అవార్డులు గురించి చెబుతారా?

**సామి :** మొదట నేను కథలు రాస్తానని, రాస్తున్నానని మా గ్రామంలో ఎవరికీ తెలియదు. 'కల్కి' పత్రికలో కథలు అచ్చవడంతో అందరూ గుర్తించారు. చాలామంది మావూరు వచ్చి సభలు పెట్టి 'Short story King' అని బిరుదులు ఇచ్చేవారు. కానీ వాటన్నింటినీ నేను తిరస్కరించాను. 2008 -09 సంవత్సరానికి గాను సాహిత్య అకాడమీ అవార్డు ఇచ్చారు. అందుకు గాను యాభైవేలు ఇచ్చారు. అందుకు చాలా సంతోషపడ్డాను.

**నేను :** మీ కథలు ఇతర భాషలలోకి అనువాదం ఏమైనా జరిగిందా?

**సామి :** ఒక నవల మలయాళంలోకి అనువాదం జరిగింది. తెలుగులోకి 'శివ చక్రవర్తి అనే కథా సంకలనం అనువదించారు. ఇక 'మనోన్మణి యమ్' సుందరనార్ యూనివర్శిటీలో నా Short stories సిలబస్‌గా పెట్టారు. మధురై కామరాజ్ యూనివర్శిటీలో నవలను, ఇతర కళాశాలల్లో కథలను సిలబస్‌గా వుంచారని విన్నాను.

నేను : మీ పిల్లలు ఏం చదువుకున్నారు? మీ రచనా వ్యాసంగానికి వారేమైనా సహాయం చేస్తారా? చదువుతారా?

**సామి :** నాకు ఇద్దరు ఆడపిల్లలు, ఒక అబ్బాయి. నేను చదువుకోలేదన్న కసితో వారిని చదివించాను. పెద్దమ్మాయి బి.ఏ. చేసింది. రెండో అమ్మాయి ఎం.బి.బి.ఎస్ చేసింది. ఇద్దరికీ పెళ్ళయింది. అబ్బాయి ఇంజనీర్ హెచ్.సి.ఎల్‌లో ఉద్యోగం, పెద్దకూతురు నేను రాసిపడేసిన వన్నీ తీసి జాగ్రత్త చేస్తుంది. సంకలనానికి సమకూర్చుతుంది. అబ్బాయి వెల్మణి చెల్వన్ కవిత్వం రాస్తాడు. అందరు నా రచనలు చదువుతారు. తమ్ముడి పిల్లలు ప్రొఫెసర్లు.

**నేను :** ఇప్పటి యువతకు మీరిచ్చే సందేశం ఏమిటి? చదవటం తగ్గిపోతున్నది కదా!

**సామి :** ప్రపంచీకరణలో యువత మొత్తం దూరిపోయింది. మార్కులు మాత్రమే వారి లక్ష్యం. వారి పుస్తకాలు తప్ప వేరే చదవడం లేదు. మద్యం మత్తులో యువత జోగుతుంది. సామాజిక స్పృహ లేనేలేదు. ఇంతకు ముందు మన భాష సాహిత్యాలపై విశ్వాసం, ప్రేమ వుండేవి. ఇప్పుడవి లేవు. అయితే వాళ్ళు మారతారనే రాస్తున్నాను. వాళ్ళు మళ్ళీ తిరిగిరాక తప్పదు.

**నేను :** అన్నీ నమకూరాయి కదా! ఇంకా ఆ గ్రామంలోనే ఎందుకుంటున్నారు?

**సామి :** ఆ చిన్నబడ్డీకొట్టు వ్యాపారమే నన్ను బతికించింది. ఆ గ్రామ ప్రజలే భాషే నన్ను ఇంత రచయితను చేసింది. నా బడ్డీకొట్టుకు వచ్చిపోయేవారితో మాటలు సంభాషణ లేకుండా నేను రాయలేను. అందుకే నేను బ్రతికున్నంత కాలం అక్కడే వుంటాను.

**నేను :** తమిళనాడు అభ్యుదయ రచయితల కళాకారుల సంఘం మీకు ఏ విధమైన ప్రేరణనిస్తున్నది?

**సామి :** ఆ సంఘం అనునాకు ప్రేరణనిస్తోంది. నన్ను ఇప్పటికి ఇలా నిలబెట్టింది? నా ఆలోచనలకు కారణం సంఘమే.

నేను : ఇంకా భవిష్యత్ ప్రణాళిక ఏమిటి? మా తెలుగు సాహిత్య లోకానికి మీరేమన్నా చెబుతారా?

**సామి :** గ్రామీణ ప్రజల గురించి రాయాల్సింది ఇంకా చాలా వుంది. నేను వున్నంతవరకూ రాస్తూనే వుంటాను. మా తమిళ ప్రజలకు ఇచ్చిన సందేశమే తెలుగు వారికి కూడా. ప్రజల జీవితాన్ని దగ్గరగా చదవగలిగితే సజీవమైన రచనా సామాగ్రి దొరుకుతుంది.

ఆఫ్రికన్ కథ

# బొమ్మ



రచయిత్రి : పత్రిసియా జెల్వర్

అనువాదం : ఎ. అన్నపూర్ణ

అది జన సంచారం లేని వూరి చివర శిథిలమైపోయిన ఒక గది. శిథిలమైపోయిన ఆ గది చూరుగుండా సూర్యుడు తొంగిచూస్తున్నాడు. పెచ్చులూడిన ఆ గది గోడలు వికృతంగా మచ్చల్లా కనిపిస్తున్నాయి. ఆరుబయట ఆ ఉదయ కాలపు నీరెండలో గది గోడను ఆనుకుని కాళ్ళు జాపుకుని కూర్చుని వుంది హెలెన్. ఆమె చూపులు ఎక్కడో దూరంగా శూన్యంలోకి చూస్తూ వున్నాయి. ఆమె కట్టుకున్న దుస్తులు పీలికలై వేలాడుతున్నాయి. ఎండ మొహం మీద పడకుండా ఈత ఆకులతో చేసిన పాత టోపీని తలమీద వాలుగా ధరించి వుంది. అంతలో ఆటలాడి అలసి కాళ్ళతో దుమ్మును రేపుకుంటూ అయిదేళ్ళ ఆమె కూతురు మరియా ఇంటివైపు వగరుస్తూ వచ్చింది.

"అమ్మా.... అమ్మా మరేమో రోజ్ వాళ్ళ నాన్న మిలట్రీ నుంచి శెలవుపై వచ్చాడు. రోజ్‌కి ఎంతో ముద్దు వచ్చే బొమ్మను తెచ్చాడు... అంటూ ఆయాసం తగ్గడానికి కొంచెం ఆగింది.

హెలెన్ ఏమీ మాట్లాడలేదు. కూతురి మాటలు ఆమె చెవిలోకి పోనేలేదు. మరియా తల్లి ఒడిలోకి చేరింది. తల్లి ముఖాన్ని తన వైపు తిప్పుకుని మళ్ళీ చెప్పింది. "రోజ్ బొమ్మకి చక్కని గుండ్రటి కళ్ళు, చిన్న నోరు, బంగారు రంగు జుట్టుతో వేసిన రెండు జడలు. ఆ జడలకు పింక్ కలర్ రిబ్బన్లు వున్నాయమ్మా. ఆ బొమ్మ ఫ్రాకు మీద రంగు రంగుల సీతాకోకచిలుకలు ఎగురుతూ ఎంత బాగున్నాయో... "ఆ ఫ్రాకు కలర్ కూడా పింకేనమ్మా! అమ్మా... నాక్కూడా అలాంటి బొమ్మ కావాలి. నాన్నని తీసుకురమ్మని చెప్పు. నాన్న ఎప్పుడు వస్తాడమ్మా... చెప్పమ్మా.... అంటూ తల్లి గెడ్డాన్ని పట్టుకుని అటూ ఇటూ ఊపుతూ మారాం చేసింది.

హెలెన్ కూతురి చేతులను విసురుగా నెట్టివేస్తూ "నీకు నాన్న లేడు. ఎన్నటికీ రానేరాడు..." అంటూ కసిరికొట్టింది.

ఇరుగు పొరుగు పిల్లలతో ఆటలాడి అలసిపోయి వున్న మరియా ఏడ్చి ఏడ్చి వెక్కిళ్ళు పెడుతూ అలాగే తల్లి ఒడిలో వాలి నిద్రపోయింది.

అయిదేళ్ళున్నా ఆ పిల్లకి సరైన తిండి, పోషణ లేక రెండేళ్ళ పిల్లలా బక్కగా వుంది.

హెలెన్ తన బిడ్డను చూసి విచారవదనంతో బుగ్గల మీద కన్నీటిని తుడిచి బిడ్డను భుజాన వేసుకుంది. లేచి నిలబడి లోనికి దారితీసి అక్కడున్న కుక్కి మంచంలో కూతుర్ని పడుకోబెట్టింది. మంచాన్ని ఆనుకుని అక్కడే కూర్చుంది. వంగి మంచం కింద వున్న పాతకాలంనాటి పెట్టెను బైటికి లాగింది. పెట్టె మూత మీదున్న దుమ్మును చేతితోనే తుడిచింది. అందులో వున్న చిన్న మెత్తటి సిల్కు తలగడను, తళతళ మెరుస్తున్న చమ్కీ దుస్తులను బైటకు తీసి కాసేపు గతంలోకి వెళ్ళింది. వాటిని తిరిగి పెట్టెలో పెట్టేసింది. నాలుగు వైపులా

తడిమి చూసింది. చివరికి ముత్యాలహారం చేతికి తగిలితే బైటకి తీసి పై కప్పు నుంచి పడుతున్న సూర్యకాంతి వైపు తిరిగి వాటిని ఆప్యాయంగా నిమిరింది. ఆ హారం వెలుగు పడగానే తళతళా మెరిసింది. దాన్ని ప్రేమ మత్తులో మునిగి వున్నప్పుడు రిచర్డ్స్ తన మెడలో అలంకరించడం గుర్తు వచ్చి శుష్కమైన ఆమె శరీరం కాస్తంత పులకరించింది. దాన్ని మెల్లగా పెదాలకు తాకించుకుని మైమరచిపోయింది.

అంతలోనే తెలివి తెచ్చుకుని ఆ హారాన్ని గట్టిగా గుప్పిటిలో దాచుకుంది. పెట్టె మూసి తిరిగి దాన్ని మంచం కిందకు నెట్టింది.

దుస్తులను మార్చుకుని చర్చి వైపు గబగబా అడుగులు వేసింది. అది చిన్న వూరు. ఆ ఊరికి ధనవంతుడు జాన్సన్. అతనికి మొక్కజొన్న తోట వుంది. ఆ ఊరి పిల్లలు చదువుకోవడానికి అతను కట్టించిన ఏడో తరగతి వరకూ స్కూలు వుంది.

జాన్సన్ మొక్కజొన్న తోటలో పనిచేసే కూలీ ఫిలిప్స్. యజమాని జాలీ దయా కరుణా గల దొడ్డ మనిషి. ఆ ఊరి ప్రజలను యధాశక్తి ఆదుకుంటాడు. అందువలన అతడంటే అందరికీ గౌరవం. ఫిలిప్స్‌కి అయిదుగురు కూతుళ్ళు. అందరిలో పెద్ద పిల్ల హెలెన్. హెలెన్ కూడా జాన్సన్ స్కూల్లోనే చదువుతుంది. ఒకరోజు ఫిలిప్స్ యజమానితో పాటు స్కూల్‌కి వచ్చాడు. అప్పుడు పిల్లలందరికీ ఆటలాడుకునే టైమ్. హెలెన్ తన క్లాస్‌కే కాదు, స్కూల్‌కే లీడర్. ఆమె చాలా చురుకైంది. నాయకురాలిగా సరిగ్గా సరిపోతుంది. పిల్లలందరినీ ఆటలాడిస్తూ క్రమశిక్షణ కలిగి వుండటం చూశాడు జాన్సన్.



ఆ అమ్మాయిని చూసి ముచ్చటపడి "ఫిలిప్స్ ఆ అమ్మాయి ఎవరు?" అనడిగాడు.

"అది నా కూతురు హెలెన్ సర్!"

"అలాగా? ఏం చదువుతోంది నాకు తెలియదే. ఈ స్కూల్లో చదువుతోందని!" అన్నాడు.

"అవును సర్. బాగా చదువుతుంది. ఇంటి పనులు చేయడంలోనూ తల్లికి సహాయపడుతుంది." మురిపెంగా కూతుర్ని చూసుకుంటూ చెప్పాడు ఫిలిప్స్.

"సంతోషం. నీ కూతురు నీ కుటుంబాన్ని ఆదుకుంటుంది" అన్నాడు యజమాని.

"మీ దయ. ఆశీస్సులు..." అన్నాడు ఫిలిప్స్ ఆనందంగా.

ఆ రోజు హెలెన్ పధ్నాలుగో పుట్టినరోజు.

ఉదయాన ఫిలిప్స్‌కి యజమాని నుంచి పిలుపు వచ్చింది. ఏమిటా అని వెళ్ళాడు.

"ఫిలిప్స్... అమ్మగారికి ఆరోగ్యం బాగుండదని నీకు తెలుసు. ఆమెను కనిపెట్టి ఉండటానికి హెలెన్‌ని మా ఇంటికి పంపాలి. అంగీకరిస్తావా? ప్రాధేయపూర్వకంగా అడిగాడు జాన్సన్.

ఈ విషయం ఊహించని ఫిలిప్స్‌కు కాసేపు ఏం చెప్పాలో తెలియలేదు.

ముఖ్యంగా భార్య అందుకు అంగీకరించాలి...

"ఏమిటి ఆలోచిస్తున్నావు? సంవత్సరానికి నీ కుటుంబానికి సరిపడ తిండి గింజలు పంపుతాను. కొంత సొమ్మును బ్యాంక్‌లో వేస్తాను. నీకేమీ లోటు వుండదు."

"కాదు.. నేను అందుకోసం ఆలోచించడంలేదు. బాగా చదువుకుంటుంది. మధ్యలో ఆపుచేస్తే... అదీ కాకుండా చేతికందిన కూతుర్ని పంపడానికి నా భార్య అంగీకరించదేమో....! సందేహంగా అన్నాడు.

"అడిగి చూడు. కాదంటే వేరే ఏర్పాటు చేసుకుంటాను" నిరాశగా అన్నాడు జాన్సన్.

ఇంటికి వచ్చిన తర్వాత భార్యతో చెప్పాడు.

అయితే ఫిలిప్స్ అనుకున్నట్లు ఎలాంటి అభ్యంతరమూ చెప్పలేదు. ఎందుకంటే యజమాని చూపించిన తిండిగింజల ఆశతో. ఎన్నాళ్ళు సంపాదిస్తే కుటుంబం గడవాలి? మిగిలిన కూతుళ్ళు తనకు పన్లో సాయపడతారు.

అయితే ఎదిగి వచ్చిన వయసులో వున్న కూతుర్ని పంపాలంటే కొద్దిగా సందేహించింది ఫిలిప్స్ భార్య.

"అదేమీ భయం లేదు. యజమాని మంచివాడు. పెద్దమనిషి. నాకు నమ్మకమే. లేనిపోని ఆలోచన చేయకు...అంటూ కసిరాడు భార్యని ఫిలిప్స్.

"మొత్తం మీద నీ కూతురు పధ్నాలుగో ఏట నీకు సిరిసంపదలు తెచ్చింది. సందేహం వద్దు. యజమాని దేవుడు. ఆయనకు సంతోషం కలిగించు" అన్నారు ఇరుగు పొరుగువారు కూడా. హెలెన్‌ని తీసుకుని యజమాని ఇంటికి వెళ్ళినపుడు ఆమె సంతోషంగానే బయలుదేరింది. యజమాని ఇంటి వైభోగం, యజమానురాలి ఆదరణ ఆమెకు కొత్తగా అనిపించనే లేదు. ఎంతో పరిచయం వున్నట్టే కలిసిపోయింది. ఆరునెలలు తిరిగేసరికి కడుపునిండా తిండి, నీడ పట్టున చేసే పనులు, సంతరించుకున్న యవ్వనం హెలెన్‌లో కొత్త అందాలు తెచ్చిపెట్టాయి. తల్లి కూడా కూతురు సుఖంగానే వుందని మనసారా సంతోషించింది. బక్కగా వుండే పిల్ల నునుపు తేలింది. కళ్ళనిండా చూసుకుని మురిసింది.

యజమానురాలు ప్రేమగా చూస్తుంది.

ఇంటి పనే కాదు, పనివాళ్ళకు జీతాలు ఇవ్వడం, తోట మీద రాబడి, ఖర్చులూ, మిగులూ అన్నీ క్షణాల్లో లెక్కలు చూడటంలో దిట్ట హెలెన్.

యజమాని పేరుకే గాని ఆయనా పనివాళ్ళతో బాటు కష్టపడతాడు. అటు స్కూలు బాగోగులు చూడటంతో ఆయనకు తీరికే ఉండదు.

ఒకరోజు వంటగదిలో కూరగాయలు బాగుచేసే పనిలో వుంది హెలెన్. ఎవరో బంధువు వస్తాడని, ఆ రోజు నుంచీ అతడికి కూడా వంట చేయాలని చెప్పింది యజమానురాలు మార్గరీటా.

అయితే వచ్చేవారు ఎలాంటి బంధువో, ఎంతకాలం ఉంటాడో అడగకూడదు కనుక హెలెన్ ఆ వ్యక్తిని గురించి ఆలోచించలేదు.

పాతికేళ్ళ యువకుడు సరాసరి వంటగదిలోకి వచ్చాడు.

వెనుతిరిగి పనిచేసుకుంటున్న హెలెన్ అతన్ని గమనించనేలేదు.

ఆ యువకుడు హెలెన్‌ను నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూసి..

"ఏయ్... బొమ్మా నాకు అర్జెంట్‌గా బ్రేక్‌ఫాస్ట్ తయారుచేయాలి అన్నాడు. అక్కడే వున్న భోజనాలు చేసే టేబుల్ దగ్గర కుర్చీలో కూర్చున్నాడు. ఉలికిపాటుతో అతడివైపు తిరిగి చూసింది హెలెన్.

అతడు బలిష్టంగా సైన్యంలో పనిచేసే వ్యక్తిలా అనిపించాడు. తీక్షణంగా ఆమె వైపు చూస్తుంటే అదిరిపడింది హెలెన్.

తలదించుకుని "ఒక్కక్షణంలో రెడీ చేస్తాను. కూర్చోండి" అంది.

బ్రెడ్ స్లైస్‌లను రోస్ట్ చేసి బటర్ రాసి ప్లేట్‌లో పెట్టి టేబుల్ మీద పెట్టింది. కొంచెం దూరంగా నిలబడింది.



ఫ్రూట్ జ్యూస్.... కాఫీ... అలా అతను అడిగినవన్నీ అందించింది. అతడి మోహపూరితమైన చూపులను తప్పించుకోవడానికి తలుపుచాటు చేసుకుంది. అతడు ఆమెను పరిశీలనగా పట్టి పట్టి చూస్తూనే తినడం ముగించి జ్యూస్ కాఫీ తాగి వంటగది దాటి వెడుతుంటే... చెప్పింది.

"నా పేరు బొమ్మకాదు. హెలెన్. బానిస అని పిలవండి చాలు."

"అయినా సరే... నువ్వు బొమ్మలా అందంగా వున్నావు కనుక బొమ్మా అనే పిలుస్తాను..." అన్నాడు ఒక్కక్షణం ఆగి నిర్లక్ష్యంగా.

ఆమె కోపంగా ఏదో అనడానికి నోరు తెరవబోయింది.

అంతలోనే అతడు వంటగది దాటి చరచరా వెళ్ళిపోయాడు.

ఆ రోజు మొదలుకుని రిచర్డ్స్ చనువుగా వంటగదిలోకి చొరబడి హెలెన్ వెంబడే తిరుగుతూ... ఆమెను తాకుతూ చిలిపి చేష్టలు చేయసాగాడు. చిలిపిగా కబుర్లు చెబుతుండేవాడు. ఒక్కోసారి తన పడకగదికి తినడానికి, తాగడానికి తెమ్మనేవాడు.

హెలెన్‌కి అతడు అలా చేయడం ఇష్టంగానే అనిపించింది. లోలోపల ఆనందించేది. అంతేకాని అతన్ని విదిలించుకోలేదు. ఒకరోజు ఇంటికెళ్ళి తల్లిదండ్రులను, చెల్లెళ్ళను చూసి యజమాని ఇంటికి తిరిగి వస్తుంటే దారిలో వర్షం కురవసాగింది. గుర్రం మీద వస్తున్న రిచర్డ్స్ వర్షంలో తడుస్తూ నడిచి వస్తున్న ఆమెను గుర్రం మీద కూర్చోబెట్టుకుని "ఇంటికి వెడదాం పద అన్నాడు. ఆమె గుర్రం మీద కూర్చుంది. వెనకగా కూర్చున్న అతనికి ఆమె నిండైన యవ్వనంలోని శరీర భాగాలు తాకుతూ వేడిసెగలను రేపింది. ఆ అనుభవంతో హెలెన్ పరవశించిపోయి అతణ్ణి గాఢంగా హత్తుకుంది. తడిసిన ఆమె ఒంటి వంపుసొంపులు రిచర్డ్స్ మతిని పోగొట్టేలా చేశాయి. ఇంటికి చేరుకున్నాక హెలెన్‌ను చేతుల్లోకి తీసుకుని తన పడకగదిలోకి తీసుకుపోయాడు. అతణ్ణి అలాగే కరుచుకుని వుండిపోయిన హెలెన్ ఆ తర్వాత ఏం జరుగుతుందో తెలియని మైకంలో స్వర్గం చవిచూసింది.

అలా ఇద్దరి మధ్యా సంబంధం కొనసాగింది.

రోజులు వేగంగా గడిచిపోసాగాయి.

ఒకరోజు రిచర్డ్స్ గది గుమ్మం దగ్గర నిలబడి అతడికి ఏదో చెప్పాలని హెలెన్ ఎదురు చూడసాగింది.

"ఏయ్ బొమ్మా! అలా నిలబడిపోయావేం.. ఇటురా! నీలో అంత అందం పెరిగిపోతుంటే నాలో కోరికలకు అడ్డూ అదుపు లేకుండా పోతున్నాయ్. రా... వచ్చి నా దగ్గరగా కూర్చో. నీకు సందేహం దేనికీ...రా... అంటూ మత్తుగా పిలిచాడు. రోజుకన్నా అందంగా కనిపించిన ఆమెను కోరికతో పిలిచాడు.

"రిచర్డ్స్... ఇకనుంచీ నీ దగ్గరకు రాను. నా ఆరోగ్యం బాగాలేదు. నా బాధ్యత స్వీకరించాల్సిన సమయం వచ్చింది. మనం పెళ్ళి చేసుకుందాం రేపే...! అంది.

రిచర్డ్స్ పెద్ద నవ్వు నవ్వాడు.

"పెళ్ళా...? నిన్నా? నీ బాధ్యత నేనెందుకు స్వీకరిస్తాను? అలా అయితే చాలామందిని చేసుకోవాలి...." అంటూ హేళనగా మళ్ళీ మళ్ళీ నవ్వసాగాడు.

"మరి నన్నెందుకు మోసగించావు?"

"మోసమా? నీలో వయసుంది. నీకూ కోరికుంది. నన్ను ప్రోత్సహించావు. నా వెంటపడి వచ్చావు. ఇద్దరమూ బాధ్యులమే. తీర్చుకున్నాం. ఇద్దరం సుఖపడ్డాం కనుక ఇందులో నా తప్పేమీ లేదు. అయినా నీకు మొక్కజొన్న తోటలో పనిచేసే కూలీలతో సంబంధం

# ధరణి ఆక్రోశం



- అవ్వారి భద్రావతి

గుండెల గునపాలు దించి
గాయపరచిన ఘనులు వారు
కడుపు పంటను
కొల్లగొట్టిన కర్కశులు వారు

మిద్దెపై మిద్దెలను గట్టి
మోయలేని బరువు నాపై మోపినారు
పచ్చని బంగరు మేనును
వెచ్చని బంజరుగ మార్చినారు

చల్లని నా యింటివారిని
ధూళిలోన కలిపినారు
నా కోసం కుమ్ములాడుతు
నను దుమ్ములోన పడదోస్తున్నారు

ముదము గొలిపే ముద్దుబిడ్డలు
ఒడిలోనే ఒరిగిపోగా
కావగ కరగని వారికి
కార్చిచ్చుతో కబురంపినారు

సునామీల సూచనలను
సుతారమూ విననివారికి
మీ ఆగడాలిక చాలునంటూ
ఇక ఆలోచన చేయమంటూ
"ఇలా"ను పంపాను

ఏయేటికాయేడు కాలమెళ్ళదీసే వారికి
కాలపాశమై కదలివస్తాను
నా ఘన వృక్షాలను ఈడ్చిన వారికి
మీ వంశ వృక్షాలనే మాడ్చగలనని
వడగాల్పుల వేగులను పంపాను

వేగిరపడనిచో తప్పదు నాతో వైరం
ఈ కోపాగ్నిలో నిలువగలేదు ఏ శౌర్యం
ఇకనైనా,
ప్రకృతికి రక్షకులవ్వండి క్షణ క్షణం
లేదా వికృతితో తప్పదొకనాడు రణం రణం
ఊపిరినిచ్చే తల్లికి కొన ఊపిరులూదగ
హరిత మిత్రులై కదలండి
కడవరకు మోసే రుణం తీర్చగ
చరిత మార్చుతూ నడవండి.

---

వుందని నాకు బాగా తెలుసు. వాడిలో ఒకణ్ణి కట్టుకో... సరిపోతుంది" అన్నాడు. ఒడిలో వున్న చిన్న తలగడతో ఆడుకుంటూ..

కడుపులో బిడ్డను మోస్తూ పదిమందిలోనూ నవ్వులపాలైన కూతుర్ని అక్కున చేర్చుకున్నాడు ఫిలిప్స్. ఆమె కోసం ఆ ఊరు వదిలి మరో చోటుకి చేరారు కుటుంబం అంతా. అక్కడే బిడ్డను కని పెంచసాగింది. కాలం గడిచి పోతుంది. చెల్లెళ్ళు వేరే ప్రాంతాలకు తరలిపోయారు. తల్లీ తండ్రీ వృద్ధాప్యంలో రోగాలబారిన పడి మరణించారు. రిచర్డ్స్ తన గుర్తుగా కూతుర్ని మిగిల్చిపోయాడు. మనస్సులో అతణ్ణి చెరిపేసి రోజులు గడుపుతుంది. ఒక్కగానొక్క బిడ్డకు కడుపునిండా తిండిలేదు. ఆడుకోవడానికి బొమ్మను కూడా కొనివ్వలేని ఆశక్తురాలై జీవితాన్ని గడుపుతోంది హెలెన్.

హెలెన్ చర్చికి చేరుకుని ఫాదర్ కోసం ఎదురుచూసింది. ప్రార్థన ముగించి అంతా బైటకు వెళ్ళిపోయారు. ఫాదర్ హెలెన్ దగ్గరకు వచ్చి "అమ్మా... నాతో ఏదైనా చెప్పాలా?" అన్నాడు.

"అవును ఫాదర్. ఈ ముత్యాల హారాన్ని మీరు తీసుకుని మేరీమాతకు అలంకరించండి. నా బిడ్డకు పట్నం నుంచి ఒక బొమ్మను తెచ్చివ్వండి. అంతకన్నా నేనేమీ కోరను" కన్నీళ్ళతో వేడుకుంది హెలెన్. ఫాదర్ ముత్యాల హారాన్ని చేతిలోకి తీసుకుని పరిశీలించి "అమ్మా! ఇది చాలా ఖరీదైంది. దీన్ని వెలకట్టే స్తోమత నాకు లేదు..." అన్నాడు. "కాదనకండి ఫాదర్. నా బిడ్డ కోరిక తీర్చడానికి ఎలాంటి మార్గమూ లేదు" అంది హెలెన్ ప్రాధేయపడుతూ.

"సరేనమ్మా... ఇటివ్వు... అంటూ హారాన్ని తీసుకున్నాడు ఫాదర్. ఆయన మనసు హెలెన్ పట్ల దయగా కరిగిపోయింది.

ఆ మరునాడు హెలెన్, మరియాలు చర్చికి వచ్చారు.

ఫాదర్ ప్రార్థన ముగించి తన గదిలో నుంచి ఒక అట్టపెట్టె తీసుకువచ్చాడు.

ఆ పెట్టెను తెరిచి బొమ్మను మరియా చేతబెట్టాడు.

చిన్నారి మరియా సంతోషంతో ఉబ్బితబ్బిబ్బై పోయింది.

ఆ బొమ్మ అచ్చం రోజ్ మేరీ బొమ్మలా ముద్దుగా వుంది.

బంగారు రంగు జుట్టుతో రెండు జడలు, గులాబిరంగు ఫ్రాకు.

బుల్లినోరు, గుండ్రని కళ్ళు... ఆ పిల్లకు చెప్పలేనంత ఆనందంగా వుంది.

హెలెన్ మేరీమాత విగ్రహానికి నమస్కరించి ప్రార్థన చేసింది. ఆ విగ్రహం చేతిలో ఖరీదైన మంచి ముత్యాల హారం అలంకరించి వుంది. ఆ ముత్యాల మీద పడుతున్న కొవ్వొత్తుల కాంతిలో ప్రతిఫలించిన మేరీమాత ముఖం దేదీప్యమానంగా వెలిగిపోతోంది.

ఫాదర్‌కి నమస్కరించి శెలవు తీసుకుని ఇంటివైపు అడుగులు వేయసాగింది హెలెన్ కూతురు మరియాతో బాటుగా.

ఇప్పుడు ఆమె మనసు నిర్మలంగా వుంది.

కూతురి భవిష్యత్ మీద భరోసా ఏర్పడింది.

కొండంత ఊరటతో హెలెన్ ధీమాగా నడవసాగింది. ●



# సంపూర్ణ సంపాదకుడు

- తెలకపల్లి రవి

సుందరయ్య కన్నుమూసినపుడు 'జీవించి వుండగానే కథాత్మక వ్యక్తులు (లెజండ్స్)గా మారే వారు అరుదు. కాని సుందరయ్య విషయంలో చాలా దశాబ్దాల కిందటే అలాటి కథలు వినిపించేవి' అంటూ నివాళు లర్పించారు. ఎన్టీఆర్ విజయ పరంపరలు వర్ణించడానికి హ్యాట్రిక్ అన్న పదం ఎప్పుడో అయిపోయినందున టెన్నిస్‌లోని గ్రాండ్ స్లామ్ అన్న మాటను తీసుకుంటున్నామని వివరణాత్మకంగా రాశారు. ఇలా ఒక సందర్భానికి తగిన మాట రాయడం కోసం ఆయన అంత ప్రాధాన్యతనిచ్చేవారు.

సున్నితమైన పద పొందిక, సముచితమైన వాక్య నిర్మాణం, సమతుల్య ప్రతిస్పందన కలిస్తే నండూరి రామమోహన రావు. ఆయన సంపాదక శాస్త్ర సాహిత్యవేత్త. తెలుగు సంపాదకులు సర్వజ్ఞులు అని ఆయన అంటుండేవారు. ఏ అంశంపైనైనా ఎడాపెడా రాసేస్తుంటారనీ, రాయాల్సి వుంటుందనీ ఆయన భావం. తను మాత్రం ఏది ఎడాపెడా రాయలేదు. ఆచి తూచి రాశారు. అలాగే జీవించారు. పాత్రికేయులకు ప్రామాణికంగా నిలిచారు. ఎన్నో వాదవివాదాలతో నిండిన నేటి వాతావరణంలోనూ ప్రతివారూ ఆయనను తలుచుకున్నారంటే కారణమదే. ప్రగతిశీల పాత్రికేయుడుగా మొదలై అనువాదాలలో రాణించి వైజ్ఞానిక రచనలకు వరవడి పెట్టి సంపాదకుడిగా స్థిరముద్ర వేసిన విజ్ఞాన సర్వస్వం ఆయన. అంత జ్ఞానవంతుడైనా ఒద్దికగా వుంటూ కలసిన ప్రతివారినీ ప్రభావితం చేసిన సంయమి. నండూరి జీవిత సాఫల్యానికి బలమైన నేపథ్యమే వుంది. బళ్లో చదువుకుంటున్నప్పుడే విజ్ఞానం అన్న లిఖిత పత్రికను నడపడం ఆయన భావి జీవిత సంకేతం. అమ్మ సేకరించి పెట్టిన శ్రీ మహాభక్త విజయం చిన్నతనంలోనే చదివి దైవభక్తులతో పాటు దేశ భక్తుల జీవితాలూ తెలుసుకున్నారు. పెత్తండ్రి నండూరి శివరావు గుడివాడలో ప్రచురణాలయం స్థాపించడం వల్ల ద్విజేంద్రలాల్ రాయ్ బెంగాలీ నాటకాల అనువాదాలు చదివే అవకాశం వచ్చింది. ఆయన మాటల్లోనే చెప్పాలంటే 'తేళ్లకు జెర్రులకు కూడా వెరవక అటకపైన వున్న ఆ కట్టలు తీసుకుని చదువుతుండేవారు.



ఆ వూపులోనే కాళిదాసు, భవభూతుల గురించీ ద్విజేంద్ర ద్వారానే తెలుసుకున్నారు. (పెత్తండ్రి భాగస్వామి అయిన జంధ్యాల శివన్న శాస్త్రి అనువాదంలో) లెక్కలేనన్ని సార్లు చదివి ఆస్వాదించిన కారణాన తనకు ప్రాచీన సాహిత్య పరిచయం కలిగించిన తొలిగ్రంథం అదేనని బల్లగుద్ది చెబుతారు. అక్కడే భారతి పాత సంచికలు వీణ పత్రిక ప్రతులు కూడా చూడగలిగారు. ఆ పాఠశాల రోజుల్లోనే పాంచ్‌ఖడీదేవ్ అపరాధపరిశోధక నవలలు కూడా వూదిపారేశారు. తర్వాత విశ్వనాథ పుస్తకాలు వగైరా, బందరు, తర్వాత రాజమండ్రి కాలేజీ చదువుల రోజుల్లో నరసింహన్ అనే అధ్యాపకుడి ప్రభావంతో షేక్స్‌పియర్, షెల్లీ, కీట్స్ తదితరులను చదవడం ప్రారంభించారు. అధ్యయన శీలత్వే ఆయనకు అక్షర సంస్కారమిచ్చింది.

తెలంగాణ సాయుధ పోరాట కాలంలో సుందరయ్య రహస్య స్థావరం అయిన కృష్ణాజిల్లా గన్నవరం ప్రాంతంలో ఆరుగొలను గ్రామంలో జన్మించిన నండూరి రామ్మోహనరావు సహజంగానే ఆ ప్రభావంలో పడ్డారు. అదే గ్రామంలో మొఖాసాదార్ల కుటుంబంలో పుట్టిన తొలితరం కమ్యూనిస్టునేత నండూరి ప్రసాదరావు ఆయనకు బాబాయి కూడా. ప్రజాశక్తి నగర్‌తో సంబంధంలో వున్న నండూరి ఉద్యమంపై సాగిన నిర్బంధానికీ సాక్షి... ఆ నేపథ్యంలోనే 1948లో ప్రభుత్వ దాడి తీవ్రమైన సమయంలో ఆంధ్రపత్రికలో చేరారు. 1955

మధ్యంతర ఎన్నికల పోరాటంలో కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారానికి ఆంధ్రపత్రిక వేదికగా మారింది. శ్రీశ్రీపై సంపాదకుడు పండితారాధ్యుల నాగేశ్వరరావు 'ఒక రచయిత' పేరుతో బనాయిస్తున్న వ్యాసాలకు నండూరి 'ఒకానొక రచయిత' పేరిట జవాబు రాయడం ఒక సాహసం. అదే ఎన్నికల కాలంలో ఆంధ్రప్రభలో కమ్యూనిస్టు వ్యతిరేకతకు పట్టం కట్టిన నార్ల వెంకటేశ్వరరావు కొన్ని పరిణామాల తర్వాత ఎఎల్ఎన్ ప్రసాద్ స్థాపించిన ఆంధ్రజ్యోతి సంపాదకుడైనప్పుడు నండూరి సహ సంపాదకుడయ్యారు. నార్ల ప్రేరణతోనే పరిణామక్రమాన్ని చెప్పే విశ్వరూపం, నరావతారం అనే రెండు ప్రామాణిక గ్రంథాలు రాసి చరితార్థులయ్యారు. విశ్వరూపంలో ప్రతి అధ్యాయానికీ ముందు ఒక కవితాచరణాన్ని లేదా పద్యపాదాన్ని ఇవ్వడం ఆయన సాహిత్యాభిరుచికి దర్పణం. ఇలాంటి ఆయనకు మార్క్‌ట్వేన్ రచనలు అనువదించడం పెద్ద పనేమీ కాదు. విశ్వదర్శనం పేరిట ప్రపంచ తత్వవేత్తల పరంపరపై రాసిన పుస్తకం మరో పెద్ద కృషి. అక్షర యాత్ర పేరిట రాసిన దానిలో సాహిత్య లేఖనాలుంటాయి. ఇంద్రగంటి శ్రీకాంతశర్మతో కలసి సంకలనం చేసిన మహా సంకల్పం ముందు మాట ఆయనలోని విమర్శకుణ్ణి, పరిశీలకుణ్ని పట్టి చూపుతుంది. ఒక శాస్త్రవేత్త ఏవిధంగా చైతన్యాన్ని జేగీయమానం చేస్తాడో ఒక కవి కూడా చైతన్యాన్ని కలిగిస్తాడంటూ 'శ్రీశ్రీ చేసింది అదే' అని గొప్ప తీర్పు చెప్పారు. తెలుగు కవిత్వంలో నిర్వేదం ఎప్పుడు ఎలా ప్రవేశించిందో విశ్లేషణాత్మకంగా చెప్పింది చూస్తే తర్వాత సాహిత్య దశలను తేలిగ్గా అర్థం చేసుకోగలుగుతాము.

ఇక సుపరిచితమైన ఆయన పత్రికా శైలి, నార్ల తర్వాత సంపాదక బాధ్యతలు స్వీకరించిన నండూరి భాషలోనూ భావ వ్యక్తీకరణలోనూ అనుసరణీయ ప్రమాణాలు నెలకొల్పారు. అనువాదం, ఉచ్చారణ వంటి విషయాలలో రాజీపడలేదు. విశ్లేషణ చేసినా వివాదాలకు ఆస్కారం వుండదు. మరీ మెత్తగా వున్నారా అని ఎప్పుడైనా సందేహం కలిగినా తప్పును ఒప్పనడం జరగదు. దివిసీమ తుఫానుపై (ఉప్పెన ఆలస్యంగా లోకానికి తెలిసింది) నవంబరు 19 రాత్రి అని ఆయన రాసిన సంపాదకీయం ఆ గండాన్ని ఎదుర్కొన్నప్పటి పరిస్థితినే కళ్లకు కట్టింది. సంపాదకీయాలు అలానూ రాయొచ్చని నిరూపించింది. సుందరయ్య కన్నుమూసినపుడు 'జీవించి వుండగానే కథాత్మక వ్యక్తులు(లెజండ్స్)గా మారే వారు అరుదు. కాని సుందరయ్య విష యంలో చాలా దశాబ్దాల కిందటే అలాటి కథలు వినిపించేవి' అంటూ నివాళులర్పించారు. ఎన్టీఆర్ విజయ పరంపరలు వర్ణించడానికి హ్యాట్రిక్ అన్న పదం ఎప్పుడో అయిపోయినందున టెన్నిస్‌లోని గ్రాండ్ స్లామ్ అన్న మాటను తీసుకుంటున్నామని వివరణాత్మకంగా రాశారు. ఇలా ఒక సందర్భానికి తగిన మాట రాయడం కోసం ఆయన అంత ప్రాధాన్యతనిచ్చేవారు. అప్సర్ ఆధ్వర్యంలో సాహిత్యం కోసం ప్రత్యేకంగా పేజీ ప్రచురించడం కూడా ఆయన సాహిత్య నిబద్ధతకొక నిదర్శనమే.

1985 తర్వాత ఆరుద్ర ఎప్పుడు విజయవాడ వచ్చినా ముందు నేను కలుస్తుండేవాణ్ణి. ఆయన అనుపమ హోటల్‌లో దిగడం, మొదట నండూరికి ఫోన్ చేయడం పరిపాటి. అలాగే నవోదయ రామ్మోహనరావు,చ బాబ్జీ తదితరులు.. ఈ దిగ్గజాలంతా మాట్లాడుతుంటే మధ్య మధ్య నేనూ మాట్లాడటం వినడం అదో ఆనందం, అనుభవం కూడా. సమగ్రాంధ్ర సాహిత్యంలో యుగ విభజనపై ఆరుద్ర, నండూరి, పురాణం అభిప్రాయాలు అడిగినపుడు చెరో విధంగా స్పందించడం ఇప్పటికీ గుర్తుంది. రాజులను బట్టి గాక కవులను బట్టి విభజన చేస్తే విశ్వనాథ శ్రీనాథయుగంలోకి వెళతారని నండూరి అన్నారు. ఆయనతో కలిసి కొన్ని సభల్లో పాల్గొన్నప్పుడు నేను చిన్నవాడినయినా సూటిగా మాట్లాడటాన్ని అభినందిస్తుండేవారు. తన సహచర సంపాదక రచయిత తుర్లపాటి కుటుంబరావు ఉపన్యాస కేసరి అయినా తను మాత్రం తక్కువగానే సభలకు వచ్చి మక్తసరిగానే ముగించేవారు. మరో పత్రికలో బాధ్యుడుగా వున్నా ఆయన ఆంధ్రజ్యోతిలో నా వ్యాసాల ప్రచురణకు అప్పట్లో అవకాశమివ్వడం కూడా ఆయన సౌజన్యమే. ఈ గమనం దానికి కొనసాగింపే అనొచ్చు. ప్రజాశక్తి ప్రచురణగా కె. రామచంద్రమూర్తి రచించిన వార్తారచన ఆయనే ఆవిష్కరించారు. నండూరి, సి. రాఘవాచారి, తర్వాత పొత్తూరి, కాస్త విడిగా ఎబికె, గజ్జల మల్లారెడ్డి, వీరంతా గత తరం సంపాదక మూర్తులు.

కాట్రగడ్డ నరసయ్య కీశే మిక్కిలినేని, కీశే బొమ్మారెడ్డి వంటివారి సాంగత్యంలో నండూరి తరచూ కనపడుతుండేవారు. మలిదశలో కొంత ఆధ్యాత్మికత వంటబట్టించుకున్నట్టు కనిపించేదిగాని అది పెద్దగా మాట్లాడాల్సింది కాదు. 2008 తర్వాత ఆయన ఆరోగ్యం బాగా దెబ్బతినిపోయిన కారణంగా నేను పెద్దగా కలుసుకోలేకపోయాను. కాకపోతే పైన పేర్కొన్న వృద్ధ పౌరుల ద్వారా ఆయన అభిప్రాయాలు, స్పందనలు తెలుస్తుండేవి. ఆయన తన పఠనాభిలాషపై విజయవాడ బుక్ ఎగ్జిబిషన్ సావనీర్ కోసం రాసిన వ్యాసాన్ని చాలా సార్లు పునర్ముద్రించుకున్నాను. నండూరి ఆరోగ్యం విషమించిందని విన్నా ఏదో వూరికి వెళ్లినందువల్ల టీవీ చూడకపోవడంతో మరణవార్త ఆలస్యంగా తెలుసుకోగలిగాను. అది చెప్పిన మిత్రుడే ఆయన నన్ను మెచ్చుకుంటూ అన్న మాటలు చెప్పినప్పుడు విచారంలోనూ విస్మయం చెందాను. హైదరాబాద్ తిరిగివచ్చాను గనక మళ్లీ అంత దూరం వెళ్లే అవకాశం లేకపోయింది. నండూరి తీర్చిదిద్దిన పత్రికలో ఈ నివాళి అర్పించి ఆ లోటు తీర్చుకుంటున్నాను. రెండు మూడు తరాల పాత్రికేయులకు ఆయన పెట్టిన వరవడి, తెలుగు భాషా సాహిత్యాలలో శాస్త్ర విజ్ఞాన రచనల్లో ఆయన నుడి చిరకాలం నిలిచి వుంటాయి. ఈ హడావుడి కాలంలో వ్యర్థ వివాదాల మాయాజాలంలో నండూరి మార్గం స్మరణీయం, అనుసరణీయం. పుస్తకాలే తన నేస్తాలని ఘంటాపథంగా చెప్పడం ఆయన పుస్తకప్రేమను ప్రతిబింబిస్తుంది. అలాగే ఆయన కూడా అనేకమంది అక్షర ప్రియులకు అభ్యుదయ వాదులకు నేస్తంగా గుర్తుండిపోతారు. సంపాదకుడన్న నాకింపారెడు భక్తి గలదు అన్న శ్రీశ్రీ ప్యారడీలోని చివరి వెటకారాన్ని తీసేసి సంపూర్ణమనుజుడాతడు, సభ్యతకే మారు పేరు సిరిసిరిమువ్వా అని సవరిస్తే నండూరికి నప్పుతుంది. ●



# స్ఫూర్తి నింపిన తమిళ అభ్యుదయ రచయితలు, కళాకారుల మహాసభలు

- కె. ఆనందాచారి

భాష తెలియదు కానీ భావం గుండె నిండింది. పరిచయాలు లేవు అయినా బంధుత్వం హత్తుకుంది. ప్రదేశమూ క్రొత్తే కానీ మార్గం ఒకటి కావడంతో కలిసి ప్రయాణం చేసే ఆలోచనలు నన్నెంతో ఉత్సాహ పరిచాయి. తమిళనాట మూడున్నర దశాబ్దాలుగా కళా సాహిత్య ఉద్యమ ప్రస్థానం ఎలా సాగుతున్నదో కళ్లారా చూసే అవకాశం నాకు కలిగింది. ఉత్తేజమూ నింపింది.

తమిళనాడు అభ్యుదయ రచయితల, కళాకారుల సంఘం పన్నెండవ మహాసభలు చారిత్రక ప్రాముఖ్యత కలిగిన, నేడు పారిశ్రామిక కేంద్రమైన 'విరుధునగర్'లో సెప్టెంబరు 16,17,18 తేదీలలో జరిగింది. తమిళ పండితుడు, సాహితీవేత్త 'శివతంబినగర్'గా ఆ ప్రాంగణానికి పేరు పెట్టారు. సెప్టెంబరు పదిహేను సాయంత్రం సభా మందిరానికి ముందు పెయింటింగ్ కార్టూన్ ఎగ్జిబిషన్ ఏర్పాటు చేసి ప్రారంభించారు. అనేక పుస్తకశాలలూ వెలిశాయి. తమిళనాడు కవులు, రచయితలు, కళాకారుల, సంస్కర్తల ఫోటోలు, చిత్రాలు, మహాసభల జెండా రెపరెపలతో ఆ ప్రదేశమంతా ఒక ఉత్సవ సందోహం వెల్లి విరిసింది.

ప్రాచీన తమిళ సాహిత్య చరిత్రలో 'సంగం' సాహిత్యానికి ఎంతో ప్రాధాన్యత వున్నది. అలాంటి సంగ సాహిత్యం మూడు దశలూ క్రీస్తు పూర్వం దక్షిణ మధురై ప్రాంతంలో 'తలైచ్చంగం' (తొలి సంగం) ఉత్తర కన్యాకుమారికి ఉత్తరంలో 'ఇడైచ్చంగం;(రెండవ సంగం) మధురైలో 'కడైచ్చంగం' (కడపటి సంగం) జరిగి ఐదు వందల గ్రంథాలపై సమీక్ష జరిపిన ఈ పరిసర ప్రాంతమైన విరుధునగర్‌లో మహాసభలు జరగటం ఒక ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. ఎందుకంటే 'సంగం' కవులు అప్పుడే సంస్కృత కావ్యాల నుండి వస్తువు తీసుకోకుండా, సంస్కృత మర్యాదలకు, పద ప్రయోగాలకు, ఛందస్సుకు విభిన్నంగా, దేశీయాంశాలను, గాథలను వస్తువులుగా తీసుకుని, సమాజాభ్యుదయ కాంక్షతో, ధర్మ, నీతి సుబోధకంగా రూపొందలేదు. అలాంటి వారసత్వ నేలలో ఈ మహాసభలు జరగటం ఒక చారిత్రక ప్రాధాన్యతను సంతరించుకున్నది.

ఇంకో ప్రత్యేతక ఏమిటంటే తమిళ రాష్ట్రానికి 'తమిళనాడు' అని భాషా వాచకంగా పేరు పెట్టడం కోసం అమరణ దీక్ష చేసి ప్రాణాలు అర్పించిన భాషాభిమాని శంకరలింగం ఊరిలో సభ జరగటం.

ఈ సంఘం 1975లో అంటే ఎమర్జెన్సీ సమయంలో పురుడు పోసుకుంది. కేవలం రచయితలు, కవులే కాకుండా కళాకారులు, నాటకకర్తలు, నటీనటులు, సినిమా రంగానికి చెందిన సాంకేతిక నిపుణులు, నటీనటులు, గాయకులు అందరికీ ఈ సంఘం ఒక వేదిక. ఇప్పటికి ఇరవై ఒక్కవేల సభ్యత్వం రాష్ట్రం మొత్తంలో కలిగి ఉన్న ఏకైక పెద్ద సాహిత్య కళా సంఘం. వెయ్యి ఆలోచనలు తలెత్తుతాయి. వంద పుష్పాలు వికసిస్తాయి. అభ్యుదయ మార్గం వైపు పయనిస్తాయి.

గిడుగు, గురజాడ, శ్రీశ్రీ మనకెలాగనో వారికి సుబ్రహ్మణ్య భారతి, భారతీ దాసన్, కళ్యాణ సుందరం ఈ ముగ్గురూ వీరి ఆరాధ్యులు. దేశభక్తిని, సమాజ అభ్యుదయాన్ని ఆకాంక్షించిన జాతీయ కవి భారతి. తమిళభాషను, సాహిత్యాన్ని పరిపుష్టం చేసి సమున్నతిలోకి తెచ్చినవాడు భారతీదాసన్. అభ్యుదయ, ప్రగతిశీల సాహిత్యాన్ని సృష్టించిన వాడు కళ్యాణ సుందరం. వీరి వారసత్వాన్ని ముందుకు తీసుకుపోతున్నదే తమిళనాడు అభ్యుదయ రచయితల కళాకారుల సంఘం.

మహాసభ ప్రారంభానికి ముందు కవులు, రచయితలు, కళాకారులు సుబ్రహ్మణ్య భారతి సొంత ఊరైన ఎట్టాయపురం నుండి అతని జ్ఞాపకార్థం జ్యోతిని తెచ్చి ఉద్యమ, వ్యవస్థాపకులైన ప్రసిద్ధ రచయితలకు అందించారు. అదే విధంగా 'తమిళనాడు'గా రాష్ట్రం ఏర్పడటానికి ప్రాణాలర్పించిన శంకరలింగం జ్యోతినీ ఊరేగింపుగా తెచ్చి అందించారు. భారతీయ భాషలలోని అనేక సాహిత్య, చరిత్ర గ్రంథాలను తమిళ భాషలోకి తీసుకువచ్చిన 'జగన్నాథరాజ' జ్ఞాపకార్థంగా పుస్తక రథాన్ని అక్కడ వుంచారు.

ఐదు వందల ఇరవై మంది ప్రతినిధులు రాష్ట్ర నలుమూలల నుండి పాల్గొన్న ఈ సభకు రాష్ట్ర అధ్యక్షుడు ప్రొఫెసర్ అరుణన్ అధ్యక్షత వహించారు. ప్రముఖ నవలా రచయిత సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత నాజిత్‌నాడన్ మహాసభలను ప్రారంభించారు. కళాకారులు, రచయితలు ప్రజల బాధలను తమ రచనలలో ప్రతిబించాలి. వారిని మేల్కొల్పాలి అని సందేశమిచ్చారు.

కేరళ నుండి వచ్చిన పురోగమన కళా సాహిత్య సంఘం

## తెలంగాణా తొలితరం రచయిత గూడూరి సీతారం



తెలంగాణా తొలితరం కథా రచయిత గూడూరి సీతారం హైదరాబాద్‌లో సెప్టెంబర్ 25న తుదిశ్వాస విడిచారు. కరీంనగర్ జిల్లా వేములవాడ మండలం హన్మాజీపేటలో 1936లో సీతారం జన్మించారు. 1950 దశకం నుండి అనేక కథలు రాసారు. తెలంగాణా మాండలికంలో తొలిదశలో ప్రజాజీవితాన్ని చిత్రించిన కథకులలో సీతారాం ఒకరు. 80కి పైగా కథలు నాలుగు నవలలు రాసారు. సిరిసిల్లలో హెచ్ఎస్‌సి వరకు చదివి, హైదరాబాద్‌లోని నిజాం కాలేజీలో బిఏ చేసారు. అదే కాలేజీలో లెక్చరర్‌గా ఉన్న డాక్టర్ సి. నారాయణరెడ్డితో సాహిత్యానుబంధం ఏర్పడింది. తెలంగాణా తొలి మాండలిక కథకులు సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటిల వారసునిగా కేశవస్వామి, పొట్లపల్లి తదితరుల సహచరునిగా సీతారం తెలంగాణా సాహిత్య చరిత్రపై తనదైన ముద్రవేశారు. మాండలికంలో 1957లో మారాజు అన్న కథ రాసారు. దాశరథి, ఆళ్వారుస్వామి, కాళోజీలు సభ్యులుగా, దాశరథి అధ్యక్షుడిగా, సినారె కార్యదర్శిగా ఏర్పడిన తెలంగాణ రచయితల సంఘంలో ఉపాధ్యక్షునిగా సీతారాం పనిచేశారు. మానేరు రచయితల సంఘానికి అధ్యక్షునిగా కొనసాగారు. సాహితీస్రవంతి నిర్వహించిన సాహిత్యశాలల్లో పాల్గొన్నారు.

రాష్ట్ర కార్యదర్శి వి.ఎస్. మురళి సౌహార్ద సందేశమిస్తూ కళాకారులు, రచయితలు నేటి ప్రపంచీకరణ పరిస్థితుల్లో నిబద్ధతగా ఉండాల్సిన అవసరం పెరిగిందని చెప్పారు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు కమ్యూనిస్టు నాయకుడు శంకరయ్య 95 ఏళ్ళ వయసులో కూడా కంచు కంఠంతో ప్రసంగించి సభను ఉత్తేజపరిచారు.

మధ్యాహ్నం రాష్ట్ర కార్యదర్శి తమిళ సెల్వం గత మూడు సంవత్సరాలలో ప్రపంచ, దేశ, రాష్ట్ర రాజకీయ సామాజిక పరిస్థితులను, కళాకారులు, రచయితలు ఎదుర్కొన్న సవాళ్లను వివరించారు. సంఘం చేపట్టిన కార్యక్రమాలను, పత్రికలు, మీడియా పరిణామాలను వివరించారు. ఆ తరువాత ప్రతినిధులు చర్చలలో పాల్గొన్నారు. ఆ సాయంత్రం సినిమాపై ఎం.శివకుమార్ ఒక పత్రం సమర్పించి 'A Little Terrorist' అనే డాక్యుమెంటరీ సినిమా ప్రదర్శించారు. ప్రముఖ సినీ దర్శకుడు ఎడిటర్ బి.లెనిన్ సినిమాలపై ప్రసంగించారు. ముప్పయి ఆరుమంది సంఘ కవులు, రచయితలు రాసిన పుస్తకాలు ఈ సందర్భంగా ఆవిష్కరించబడ్డాయి.

సెప్టెంబర్ 17న పెరియార్ రామస్వామి పుట్టినరోజు సందర్భంగా ఆయన చిత్రపటానికి మాలవేసి బహిరంగ సభా వేదికపై ఆయన భారతదేశంలో కుల వ్యవస్థపై, వర్ణాశ్రమ ధర్మాలపై, స్త్రీల బానిసత్వంపై పోరాడిన అంశాలను గుర్తుచేస్తూ పాటలు పాడి నివాళి అర్పించారు.

ఆంధ్రప్రదేశ్ నుండి సౌహార్ద ప్రతినిధిగా మహాసభకు శుభాకాంక్షలు తెలుపుతూ సుబ్రహ్మణ్య భారతి, గురజాడ సాహిత్య పోలికలను గుర్తు చేశాను. ఒకే భాషా కుటుంబానికి చెందిన మనం సాహిత్య సాంస్కృతిక అంశాలను కూడా సరుకుగా మారుస్తున్న ప్రపంచీకరణ విస్తరణ ఎదుర్కొనేందుకు అభ్యుదయ సాహిత్యానికి ఇంకా పదునుపెట్టి విస్తరించాల్సిన అవసరం వుందని పిలుపునిస్తూ, మన రాష్ట్రంలో సాహితీ స్రవంతి ప్రపంచీకరణ ప్రభావానికి వ్యతిరేకంగా ఏర్పడి ఎలా పనిచేస్తున్నదో వివరించాను. నాతోపాటు వచ్చిన తిరుపతి ప్రజాశక్తి సాహితీ సంస్థ బాధ్యులు చంద్రశేఖర్ నా ప్రసంగాన్ని తమిళంలోకి అనువదించారు.

అదే రోజు సాయంత్రం మీడియా పాత్రపై చెన్నై వచ్చిన ఆసియా మీడియా అభివృద్ధి సంస్థ డైరెక్టర్ శశికుమార్ మాట్లాడుతూ లాభాలు ఎలా ఎక్కువ చేసుకోవాలో అని ఆలోచించే కార్పొరేట్ శక్తుల అధిపత్యంలోకి మీడియా ఎలా పోయిందో వివరించారు. ఒకనాడు మనం మీడియా స్వేచ్ఛ గురించి పోరాడితే నేడు మనం మీడియా నుండి స్వేచ్ఛ పొందటం కోసం పోరాడాల్సి వస్తోందని, వార్తలను వస్తువులుగా పాఠకులను వినియోగదారులుగా మార్చిందని, ఈనాటి మహాత్మునిగా అన్నాహజారేను చూపెడుతూ శ్రామికుల పోరాటాలను మరుగున పడేస్తున్నదని వివరించారు. మధుకుర్ రామలింగం నేటి కులతత్వ శక్తులు ప్రజలను ఎలా కొత్త ఎత్తుగడలతో చీల్చే ప్రయత్నం చేస్తున్నదో వివరించారు. వెంకటేశన్ తమిళ సాహిత్యంలోని పురోగమనం, తిరోగమన సంప్రదాయాలను విపులంగా చర్చించారు.

మూడవరోజు చరిత్ర పరిశోధకులు ప్రొఫెసర్ కె.ఎన్.ఫణిక్కర్ హాజరై కర్తవ్యాలను చెబుతూ ఈ రోజు పెట్టుబడిదారీ సమాజంలో మన సాంస్కృతిక రంగం జోక్యం చేసుకోవాల్సిన అవసరం చాలా ఉన్నదని, స్వాతంత్ర కాలంలో 'అభ్యుదయం' అన్న పదానికి నేడు అభ్యుదయం అన్న దానికి అర్థంలో తేడాను, నూతన ఉదారవాద దోపిడీ విధానాలపై పోరాటానికి పెద్ద ఎత్తున కళాకారులను, రచయితలనూ సమీకరించాలి. మన శత్రువు ఎవరో స్పష్టంగా గుర్తించాలి అని వివరించారు.

ప్రసిద్ధ తమిళ సాహిత్య విమర్శకుడు టి.కె. శివ శంకరన్, సంఘ వ్యవస్థాపకుడు నవలా రచయిత కాశ్యపన్, నవలా కారుడు చిన్నప్పభారతి, రచయిత భాస్కర శక్తి, కవయిత్రి తిలగభామ, నాటక కర్త ప్రళయన్, కథా రచయిత పొన్నుచామి మొదలైన మహామహులు పాల్గొన్న ఈ సభలు ఎంతో స్ఫూర్తిని, సాహిత్య ప్రేరణని కలిగించాయి. మహాసభ నూతన ప్రతినిధులను ఎన్నుకుంది.

కళాకారులు, రచయితలు, పాఠకులు, అభిమానులతో పట్టణంలో పెద్ద ఊరేగింపు, చివరిరోజు రాత్రి అంతా కళా ప్రదర్శనలు, ప్రసంగాలతో, పాటలతో సాంస్కృతిక ఉద్యమ శంఖారావాన్ని పూరించింది. నా కొక చైతన్యపూరిత సందేశాన్ని అందించింది.

# ఆకర్షణీయ కథనం
# వీరాజీ - విడీవిడని చిక్కులు

- శైలి



నలభై - ఏభై ఏళ్ల క్రితం నవల. కాదంటే పెద్ద కథ. అణాఅర్ధణాల కాలం. రాష్ట్రంలో కాశీతో పోల్చదగిన నగరం రాజమండ్రి. అక్కడ స్థిరపడిన బ్రాహ్మణ సమాజం. స్వాతంత్ర్యానంతరం ఆ ప్రాంతానికి అప్పుడు చేరిన ఆధునిక భావాలు, చదువులు, గుమస్తా ఉద్యోగాలు, మధ్యతరగతి ఉపరితల సమాజంపై అల్లుకుంటున్న సామాజిక సంఘర్షణను ఆకర్షణీయంగా విప్పి చెప్పేందుకు చేసిన సత్ప్రయత్నం ఇది.

పుస్తకం చదువుతున్నప్పుడు అప్పట్లో అక్కినేని నాగేశ్వరరావు నటించిన నలుపు తెలుపు సాంఘిక చలన చిత్రం చూసిన అనుభూతి కలుగుతుంది. పాత్రల పరిచయం, ప్రవేశం, సన్నివేశాల వర్ణన, కూర్పు, నిష్క్రమణ అంటే లగువుబిగువుల స్థాయిలో సాగి పగడ్బందీ స్క్రీన్‌ప్లేను తలపింపజేస్తాయి. నవల ఏకబిగిన పాఠకుడిని సరళంగా చదివించడానికి రచయిత వీరాజీ శైలి. భాషా ప్రావీణ్యంతో పాటు కష్టపడి రూపొందించుకున్న ఆ తీరు కూడా అర్థమవుతుంది.

పైకి నవనీతం మృదుమధురంగా ఉన్నదంటేనే మజ్జిగ చిలికిన కష్టం లోలోపల దాగి ఉన్నట్టే కదా దానికి తార్కాణం. ఈ కథను నేను కష్టపడి రాశాను' అని కూడా రచయిత వక్కాణించాడు.

సూర్యం కేంద్రంగా కథ నడుస్తుంది. సూర్యానికి బామ్మ నరసమ్మ తప్ప మరెవ్వరూ లేరు. సూర్యం తండ్రి చంద్రమౌళి సూర్యం చిన్నప్పుడే వేరే యువతితో వెళ్ళిపోతాడు. ఆ దిగులుతో సూర్యం తల్లి చనిపోతుంది. అప్పటి నుంచి బామ్మే సూర్యాన్ని తల్లీతండ్రై పెంచుతుంది.

చంద్రమౌళి వేరే కులం యువతితో వెళ్ళిపోయాడు అనేకంటే చనిపోయాడు అనుకుంటేనే తమ సమాజంలో కుటుంబ మర్యాదలు దక్కుతాయని అసలు విషయం సూర్యానికి చెప్పకుండా దాస్తుంది బామ్మ.

చంద్రమౌళికి ఆ యువతికి పుట్టిన అమ్మాయి నిర్మల. నిర్మల అక్రమ సంతానంను సాకుగా తీసుకుని భర్త అనుక్షణం ఆమెను వేధించడంతో విధిలేక బయటకు వచ్చి, తనకున్న చదువును ఆసరాగా చేసుకుని చిరుద్యోగం చేసుకుంటూ ఒంటరిగా బ్రతుకుతుంది. మొగుడు వదిలేశాడు లేదా మొగుడ్ని వదిలేసింది అనే కంటే మొగుడు చచ్చాడనుకుంటేనే భద్రత ఎక్కువ ఉంటుందని భావించి కృత్రిమ వైధవ్యం స్వీకరిస్తుంది నిర్మల.

నిర్మలకు, సూర్యంకు తండ్రి చంద్రమౌళి ఒక్కడేనన్న విషయం కథ చివర్లోగాని పాఠకునికి తెలియదు సస్పెన్స్ కొనసాగుతుంది. దానికి సమాంతరంగా మరో కథ నడుస్తుంది. రాజ్యలక్ష్మి కథ. రాజ్యలక్ష్మి తండ్రి సాంబశివరావు. పెండ్లి కాకముందు ఈయన రౌడిగా చెడు అలవాట్లతో తిరిగి ఒకానొక ముహుర్తాన పనిమనిషి కూతురు కాంతం పంచనజేరి కాలుజారతాడు. ఆ ఫలితమే రాజ్యలక్ష్మి. పసికూనను సమాజం ఆమోదించదు కనుక, చావు బ్రతుకుల మధ్య నున్న వదిన చేత ఆ పసికూనని దత్తత చేయించుకుని, ఆమె తదనంతరం ఆమె బిడ్డను తాను సాకుతున్నట్టు చెలామణి అవుతాడు. భార్య గయ్యాళి లలితాంబ ఈ 'కసి'ని రాజ్యలక్ష్మిపై అడుగడుగునా చూపిస్తుంది, కొడుతుంది. చిత్రవధలు పెడుతుంది.

లోకంలో అక్రమ తల్లితండ్రులు ఉంటారు గాని అక్రమ సంతానం ఉండరు కదా. కాని నిజం తెలిసి జాతి తక్కువ అమ్మాయిగా ఆ బ్రాహ్మణ సమాజం చేత వెలిగావించబడి మిగిలినవారికి సమస్యగా మారేకంటే మరణమే శరణ్యమనే నిర్ణయానికి వస్తుంది రాజ్యలక్ష్మి. ఇక సాంబశివుని మనోవేదన చెప్పనలవి కాదు.

ఇకపోతే మేనమామ జయరాముడు. కూతురు మీనాక్షి, హెడ్ గుమస్తా శంకరం, మొదలగు పాత్రలు కథను నడిపించడానికి బలంగా సహకరిస్తాయి. హాస్యం కోసం మంగపతి అమ్మలక్కలు. అలంకారం కోసం రీటా, రాధాలు, అభ్యుదయం కోసం జగన్నాథం పాత్రలు ఉండనే ఉన్నాయి.

నీ వర్తమానం ఏమిటి ముందు నీవు చేయబోయే యుద్ధానికి ఆయుత్తం మాత్రమే. అప్పుడిక సమరంలో దిగక తప్పదు. సంసారంతోను సంప్రదాయాలతోను సతమతమవక తప్పదు. ఇప్పుడెంత పుంజుకుని పెరిగితే అప్పుడంత నిలదొక్కుకుని సమాజాన్ని ఎదుర్కొంటావు. అనుభవజ్ఞుడైన శంకరం యువకుడైన సూర్యంకు చెప్పే జీవన గమనపు తాత్విక ఉద్బోధ. కథ ప్రారంభం ఇది.

అస్వస్థతతో మంచం ఎక్కిన సూర్యం బామ్మకు పలువురు యువతులు పరిపరివిధాల సపర్యలు చేస్తారు. అప్పుడు ఆమెలో కలుగుతున్న మార్పును రచయిత ఈ విధంగా వ్యక్తం చేస్తాడు.

# కవితావేశం

- కోపూరి పుష్పాదేవి



అందమైన జలపాతాన్ని చూసినప్పుడు
మది మయూరిలా నాట్యం చేస్తే
మనసు కవిత్వమై కమనీయమవుతుంది
మనిషిలోని మానవతను దర్శించినపుడు
పసిపాపల నిర్మల సౌందర్యాన్ని వీక్షించినప్పుడు
పూబాలల సయ్యాటలు
మేఘమాలికల వర్ణ సందోహాలు గమనించినప్పుడు
ప్రకృతి రమణీయతను మనసారా కాంచినప్పుడు
మనసు మురిసి మందారమవుతుంది

గాజులు మ్రోగినా
జాజులు నవ్వినా
మనసు రాజుకుంటుంది
కవిత జాలువారుతుంది
అందానికి పులకించడమే కాదు
అనర్థాన్ని కవిత ఖండిస్తుంది
అన్యాయాలు జరిగినప్పుడు
అకృత్యాలు చెలరేగినప్పుడు
కవిత కణ్నెర్ర చేస్తుంది
కష్టాలు, కడగండ్లు దాటే ధైర్యం
నిజాయితీగా, నిండుగా అందజేస్తుంది

# రెక్కలు

- గోపాలుని వెంకటేశ్వర్లు



అనుభూతుల
నదులు
ఇంకిపొయ్యాక
అంతా నిస్సారమే -

జీవితం
ఎడారి

రాతి గోడను
చీల్చి
విస్తరిస్తూ
మర్రిచెట్టు -

అవకాశాలను
సృష్టించుకోవాలి

దూరం నుంచి చూస్తే
భూమి
ఆకాశం
కలుస్తున్నట్లనిపిస్తూ -

భ్రమల పరిధికి
అంతం ఉండదు

అనుభూతి అంటే
ఓ గాలి కెరటం
ఓ పూల పరిమళం
ఓ వెన్నెల జల్లు -

జీవితం
రసమయం

అనుకొన్నది
జరగాలంటే
కొంతకాలం
నిరీక్షించాల్సిందే -

పువ్వు వికసించాలని
ఆజ్ఞాపించగలమా?

ప్రకృతిలోని
అందమంతా
తాగేసిన నా కళ్ళు
మత్తులో ఎర్రబడుతున్నై! -

ప్రకృతి ఆరాధన
ఓ వరం

గంధపు
చెక్క నుండే కాదు
గంధపు చెట్టు
వేర్ల నుండి కూడా సువాసనే -

పరిమళం
ఓ ప్రవాహం

చెరుకును
ఎక్కడ
విరిచినా గాని
తీయనే కదా! -

రసానుభూతికి
ఆద్యంతాలు లేవు

---

'ఆమెకు రాజ్యలక్ష్మి మీద జాలి, మీనాక్షి మీద ఆపేక్ష, నిర్మల మీద సానుభూతి, సూర్యం మీద మమకారం, బ్రతుకుమీద ఉదాసీనం అన్నీ ఒక్కసారి పెనవేసినందున హృదయాంతరాళాల్లో భావాలు విడీవడని చిక్కులుగా పడిపోయాయి.

అందరికంటే దృఢమైన పాత్ర నిర్మలది. 'ఏమో సుమా. బలమైన మనఃప్రవృత్తులు గలవాళ్ళని ఈ సమాజం ఆపలేదనుకుంటాను. అసలు ఆత్మీయత లోపించకుండా ఉండాలి. ఈ పురుషుల విషయంలో పరువు, ప్రతిష్ట, ధనం, సంపద ఇత్యాది భౌతిక విషయ వాంఛలతో ఆత్మీయత పోటీపడి లోపిస్తుందను కుంటాను. మన విషయంలో అదే నెగ్గుతుందేమోనన్నది నిర్మల.

ప్రగతిశీల ఆశాభావంతోపాటు పాత్రల స్వభావ సునిశిత పరిశీలనను రచయిత జమిలిగా పెనవేస్తాడు. "పాత్రలు సన్నివేశాలు కేవలం కల్పితాలు అనాలి. అది అబద్ధం కూడా కాకపోవచ్చును" అని రచయిత చెప్పడంలోనే అంతరార్థం ఇమిడి ఉన్నది. ఒకర్నొకరు గాఢంగా ఇష్టపడే సూర్యం. రాజ్యలక్ష్మిలు చివరికి కలుసుకోగలిగారా? పెళ్లి చేసుకున్నారా? లేదా? అనే ప్రశ్నలు పాఠకులకు శేష ప్రశ్నలు గానే మిగిలిపోతాయి.

ముఖ్యంగా ఇక్కడ కావాల్సింది ముగింపు కాదు. మార్పు అనుకుంటాను. అది రావాల్సిన చోటు వేరే ఉన్నది. సమాజమే అది' అని రచయిత పేర్కొనడం సామాజిక పరిణామంలో అంతర్భాగం కావడమే. రచయిత చలనశీల పరిణితి కూడా ఇదే.

కథలు అందంగా ఆకర్షణీయంగా రాయాలనుకునే వర్ధమాన కథా రచయితలకు ఇదో గొప్ప కానుక. కాలమిస్తుగా రచయిత వీరాజీ గోల్డెన్ జూబ్లీ ఇయర్ సందర్భంగా 'చినుకు' ప్రచురణల వారు ఈ తరానికి ఆ తరం కానుకను అందించడం అభినందనీయం. •

# కొత్త పుస్తకాలు




## నా చూపు రేపటి వైపు (కవితా సంపుటి)

**- డా॥ సి. నారాయణరెడ్డి**

**వెల : రూ.150/- పేజీలు : 168**

**ప్రతులకు : విశాలాంధ్ర, బుక్‌హౌస్ (అన్ని బ్రాంచీలు)**

అందలేని ఎత్తుల అంచు చూడాలని
ఎగిసిపోతున్న కళ్ళు ఆరాటపడుతున్నాయి
అంతు చిక్కని లోతుల
ఆంతర్యమేమిటో తెలుసుకోవాలని
మునకలేసే శరీరం ఉబలాటపడుతున్నది
ఇవన్నీ ఏకకాలంలో జరగాలని
ఉత్సాహం ఉరకలేస్తున్నది
ఒక చేత్తో ఎత్తుల్ని అందిపుచ్చుకుని
మరో చేత్తో లోతుల్ని పిడికిట్లో పట్టుకుని
నేలపైకి తిరిగొస్తే నేను నేనుగా ఉంటానా?
రెండుగా చీలిపోతానా?

**- డా॥ సి. నారాయణరెడ్డి**




## గోసంగి (దళిత దీర్ఘకావ్యం)

**- ఎండ్లూరి సుధాకర్**

**వెల : రూ.50/- పేజీలు : 58**

**ప్రతులకు : 0883-2419322**

అస్తిత్వవాద, ప్రాంతీయవాద నేపథ్యంలో గోసంగులకూ, దక్కలి వాళ్ళకు ఇంకా ఇలాంటి వారికి ఎలాంటి న్యాయం జరగాలి? అనేది ఇప్పుడు మనముందున్న ప్రశ్న. సాహిత్యంలో సమాజం ప్రతిబింబిస్తుందని అంటారు కదా! ఈ వాక్యం తెలుగు సాహిత్యానికి వర్తిస్తుందా? మన కవులూ, మన కళాకారులూ, మన మేధావులూ, మన రచయితలూ, మన పాలకులూ, తమ కలాల్ని, తమ గళాల్ని ఆ దిశవైపు మళ్ళించే కాలం వస్తుందా? అది దళిత కులాల సాధికారత ఫలిస్తుందా? ఫలించాలనే నా అక్షర ప్రయత్నం. ఈ రకమైన ఆలోచనలకు ప్రాతిపదిక డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ గొంతుక.

**- ఎండ్లూరి సుధాకర్**




## హంసధ్వని (రెక్కలు)

**- ద్యావరి నరేందర్‌రెడ్డి**

**పేజీలు : 68**

**ప్రతులకు : 9848995597**

ఏ లఘురూపమైనా, ప్రారంభించిన కాలం కంటే, అనేకమంది రాస్తుండగా, వస్తు శిల్పాల్లో మరిన్ని కోణాలు పరిణమిస్తాయి. అంతేగాక, విమర్శకుల విశ్లేషణలు బాగా అధ్యయనం చేస్తే, మరింత పరిణతి ఏర్పడుతుంది. మినీ కవిత రూపం, అలాగే రాను రాను ఈనాటి దాకా ఏవో కొన్ని కొత్త అభివ్యక్తుల్ని సమకూర్చుకుంటూనే ఉంది. ఈ క్రమంలోనే 'రెక్కలు'కి ఒక ప్రత్యేక వాహినిని కల్పిస్తూ ద్యావరి నరేందర్‌రెడ్డి రెక్కలు రాశాడు.

**- డా॥ అద్దేపల్లి రామ్మోహనరావు**




## కథలు

**- నాయుని కృష్ణమూర్తి**

**వెల : రూ.75/- పేజీలు : 202**

**ప్రతులకు : 08581 256234**

సాహితీ విమర్శకులు చెప్పే కథా లక్షణాలు 'చెప్పే కథ'ల్లోను కనిపిస్తాయి. కథ సంక్షిప్తంగా ఉండాలి. కథనంలో నేర్పు ఉండాలి. ఒక మెరుపు కనిపించాలి. ఆశ్చర్యం కలిగించే ఒక మలుపుతో ఆగాలి. ఒక కొత్త కోణాన్ని ఆవిష్కరించగలగాలి. కథ చదివిన పాఠకుడు కాస్సేపయినా ఆ కథ గురించి ఆలోచించాలి. ఎన్ని లక్షణాలయినా చెప్పండి ఇవన్నీ నిరక్షరాస్యులు చెప్పే కథల్లో, నివేదించే సంఘటనల్లో ఒకటో రెండో ప్రత్యక్షమవుతాయి.

**- నాయుని కృష్ణమూర్తి**




## శృతిలయలు (గేయాలు)

**- అలపర్తి వెంకట సుబ్బారావు**

**వెల : రూ.70/- పేజీలు : 80**

**ప్రతులకు : 08644 -241366**

| | |
|---|---|
| చిన్నారి లోకం | కోపతాపాలు |
| పొన్నారి లోకం | పాప శాపాలు |
| అందాల స్వర్గం | లేని సదనాలు |
| ఆనందమార్గం!! | లేత వదనాలు!! |
| మసిబారనట్టి | భాషలు అనేకం |
| కసి నేరనట్టి | భావాలు ఏకం! |
| పసివారి ఎదలు | అంతా మమేకం |
| పసిడి సంపదలు!! | ఎంతో వివేకం!! |

**- అలపర్తి వెంకటసుబ్బారావు**




## కవిత్వం ఓ సామాజిక స్వప్నం!

**- డాక్టర్ రాధేయ**

**వెల : రూ.90/- పేజీలు : 200**

**ప్రతులకు : 9985171411**

ఒక కవి, ఒక కావ్యం, ఒక ఉద్యమం, ఒక భావజాలం, ఒక ప్రాంతం, ఒక సామాజిక వర్గం, ఒక ఛందస్సు, ఒక కాలం - ఇలా అనేక ప్రమాణాలు ఆధారంగా తెలుగు కవిత్వ విమర్శ వస్తున్నది. రాధేయ వీటినన్నిటినీ వదిలిపెట్టి తెలుగు కవులంతా కలిసి ఏయే వస్తువుల్నీ కవిత్వీకరిస్తున్నారో గుర్తించి వ్యాఖ్యానించారు. ఒక్కొక్క వ్యాసంలో కనీసం ఇరవై మంది కవుల్ని ఉదాహరించారు. అంటే ఒక వస్తువును ఇరవై మంది కవులు వాళ్ళ వాళ్ళ అవగాహన నుండి, భావజాలం నుండి, నిబద్ధత నుండి కవిత్వీకరిస్తున్నారన్నమాట.

**- రాచపాళెం చంద్రశేఖరరెడ్డి**

### మనోహర దృశ్యం (కవితా సంపుటి)

– పొత్తూరి సుబ్బారావు

వెల : రూ.70/– పేజీలు : 114

ప్రతులకు : విశాలాంధ్ర, ప్రజాశక్తి బుక్‌హౌస్ (అన్నిబ్రాంచీలు)

పొత్తూరి సుబ్బారావు సామాజికంగా వస్తున్న ఈ మార్పులన్నీ గమనిస్తూ కవిత్వం రాస్తున్నవారు. వ్యక్తి, కుటుంబం, సమాజం, క్రమక్రమంగా ఎలా అవాంఛనీయమైన మార్పులు పొందుతున్నాయో అవగాహన చేసుకుంటున్నవారు. వీటిని అందరికీ కవిత్వ రూపంగా తెలియజేయడానికి క్లిష్టత లేని భావ ప్రసార పద్ధతిని ఎన్నుకొని తన భావాన్ని వ్యక్తపరుస్తున్నవారు. పొత్తూరి సుబ్బారావు చెబుతున్న విధానం గుండెను చరిచి చెపుతున్నట్లు ఉండదు. భుజంమీద తట్టి అంగీకరింపచేసే రీతిలో వుంటుంది.

– డా॥ అద్దేపల్లి రామ్మోహనరావు

### మొగలి రేకులు (రెక్కలు)




– జె. రామకృష్ణరాజు

వెల : రూ.0/– పేజీలు : 63

ప్రతులకు : 9440842663

వివిధ కోణాల్లో జీవితాన్ని దర్శించడం, విశ్లేషించడం. నిత్య సత్యాకృషికి గాని సాధ్యపడని అంశాలు. ఈ రెక్కల సంపుటిలోని నూరు మొగలి రేకుల్లోనూ సమాజానికి హితవు చెప్పేందుకే పరితపించే కవిని చూస్తాం.

"అమ్మ అనే / రెండక్షరాల పదం /
ప్రేమకు / పట్టుగొమ్మ –
మాతృభావన / అమృతోపమానం!"

అనగలిగిన కవి పరిచయం కన్నా సభ్య సమాజానికి కావలసిందేముంటుంది?

– యం.కె. సుగమ్‌బాబు

### ముత్యాలజల్లు (కవిత్వం)




– మొహమ్మద్ ఖాన్

వెల : రూ.60/– పేజీలు : 128

ప్రతులకు : 94401 37475

మొహమ్మద్‌ఖాన్ "ముత్యాలజల్లు" లోని కవితల్ని పరిశీలిస్తే, అతనికి 'జీవితం' ప్రధానమైన వస్తువు. జీవితాన్ని, తనవైపు నుండి అర్థం చేసుకునే దారిలో అనేకానేకమైన భావాలు తరంగాలుగా పైకి లేస్తూ ఉంటే వీటిని గ్రహించి అక్షర రూపమివ్వడంలో ఈ సంపుటిలోని చాలా కవితలు రూపొందినవి.

– డా॥ అద్దేపల్లి రామమోహనరావు

### గోపి కవిత – మానవత




– డా॥ గట్ల రవికుమార్

వెల : రూ.200/– పేజీలు : 280

ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్ (అన్ని బ్రాంచీలు)

ఈ గ్రంథంలో డా॥ రవికుమార్ ఐదు అధ్యాయాలుగా మానవతావాద వివిధ దశలను, దిశలను గోపి కవిత్వానికి సమన్వయిస్తూ వివేచనాత్మక రచన చేశాడు. మొదటి అధ్యాయంలో మానవతావాద స్వరూపాన్ని వివరిస్తూ, రెండవ అధ్యాయంలో ఆధునిక కవితలో మానవత పాత్రను ఉటంకిస్తూ, మూడవ అధ్యాయంలో వర్తమాన కవితా ధోరణుల్లో గోపి కవిత్వ మౌలికతను ఉల్లేఖిస్తూ, నాల్గవ అధ్యాయంలో గోపి కవితల్లోని మానవతావాద దృక్పథాన్ని వివరిస్తూ, ఐదవ అధ్యాయంలో గోపి జీవన రేఖలను గురించి, అతను రచించిన కవిత్వేతర ప్రక్రియలను గురించి విస్తృతంగా చర్చించాడు.

– డా॥ సి. నారాయణరెడ్డి

### నా గుండె గుమ్మానికి పచ్చనాకువై... (కవిత్వం)




– డా॥ యం.బి.డి. శ్యామల

వెల : రూ.75/– పేజీలు : 120

ప్రతులకు : 99497 74818

శ్యామల గారి కవిత్వంలో పర్యావరణంలో కలుగుతున్న మార్పుల పట్ల నిస్పృహ కనిపిస్తోంది. దాన్ని శక్తివంతంగా చూపించగలిగే అవకాశం ఉంది. ఆమె ఆ ప్రయత్నం యిప్పటికే మొదలు పెట్టినందుకు శుభాభినందనలు. అలానే పాత భావాల ఆసరా నుంచి బైటపడటం కూడా అవసరం.

– డా॥ విద్యాసాగర్ అంగళకుర్తి

### నెల్లూరు గాలివాన




– దీపాల పిచ్చయ్యశాస్త్రి

వెల : రూ.20/– పేజీలు : 46

ప్రతులకు : 944405 29785

నెల్లూరులో 1927లో సంభవించిన తుఫాను బీభత్సమును కథా వస్తువుగా తీసుకుని దీపాలవారు రాసిన నెల్లూరు గాలివానను తిరిగి ముద్రించడం ఆనందంగా వుంది. దాదాపు 84 ఏళ్ళ తర్వాత దానిని ప్రజల మధ్యకు తీసుకొచ్చేందుకు మూడు కారణాలున్నాయి. ప్రస్తుతం కవితా ధోరణుల్లో అగ్రభాగాన వున్న సంఘటనాత్మక కవిత్వం ఆనాడే ఉందనే దానికి నిదర్శనం దీపాలవారు నెల్లూరు చరిత్ర చిహ్నమైన గాలివానను పద్యరూపంలో రాయడం. భారతిలో ప్రచురించడం. సరళమైన భాషతో వెలువడిన ఈ 93 పద్యాలను ప్రజల్లోకి, ముఖ్యంగా పాఠశాలల పిల్లల్లోకి తీసుకెళ్ళాలనే ప్రయత్నం.

– ప్రచురణకర్తలు

జూన్ & జూలై ప్రస్థానం ప్రత్యేక సంచికకు అనూహ్య ఆదరణ వచ్చింది. వివిధ పత్రికలలో అభినందిస్తూ సమీక్షలు ప్రచురించారు. వాటిలో నుండి సంక్షిప్తంగా ఇక్కడ ప్రచురించాం. ఇవే గాకుండా ఆంధ్రప్రభ, సూర్య వంటి పత్రికల సాహిత్య అనుబంధాలలో ప్రత్యేక సంచికలోని జాషువా, చాసోలా వ్యాసాలను పూర్తిగా ప్రచురించారు. వారందరికీ ధన్యవాదాలు..

## విపుల

# ప్రత్యేక ప్రస్థానం

'సాహిత్య ప్రస్థానం' మాసపత్రికను జూన్-జూలై నెలలకు కలిపి ప్రత్యేక సంచికగా వెలువరించారు. వివిధ సందర్భాల్లో, వివిధ పత్రికల్లో వచ్చిన మహామహుల వ్యాసాలను సేకరించి ప్రచురించడం నిజంగా ప్రత్యేకమే.

గురజాడ మొదలు వేటూరి, శ్రీపాద, చలం, దువ్వూరి, జాషువా, విశ్వనాథ, శ్రీశ్రీ, కనుపర్తి, సురవరం, కాళోజి ఇలా తెలుగునాట ప్రసిద్ధికెక్కినవారితో పాటు సుబ్రహ్మణ్య భారతి, టాల్‌స్టాయ్, గోర్కీ లూసన్ వంటి రచయితల వ్యాసాలు కూడా సంకలించడం వల్ల ప్రాచ్య, పాశ్చాత్య సాహితీ రీతుల్ని ఒక్కచోట దర్శించే అవకాశం కలిగింది. అప్పట్లో కవులు, రచయితలు సాహితీ సేవలో పడ్డ కష్టాలను శ్రీపాదవారి వ్యాసం కళ్ళు చెమర్చేలా చెప్పింది. కథానిక, నవలిక, నవలలపై కొడవటిగంటి విశ్లేషణ ఒక సిద్ధాంతం వంటిది. భారతీయ, పాశ్చాత్య విమర్శనా రీతులు పురిపండా అప్పలస్వామి వ్యాసంలో కళ్ళకు గడతాయి. ఇందులోని నలభై వ్యాసాలు నిత్య నూతనంగా కొత్త కొత్త విషయాలను తెలియజెప్పేవే.

ఆనాటి రచయితలు, కవుల గురించి ఇప్పటి తరం తప్పక తెలుసుకోవలసిన ఎన్నో విశిష్టమైన అంశాలు ఇందులో ఉన్నాయి. ప్రచురణకర్తలకు అభినందనలు. ప్రతి సాహిత్య అభిమానీ దాచుకోవలసిన సంచిక ఇది.

---

## మిసిమి

# సాహిత్య ప్రస్థానం

ప్రతి సంవత్సరం 'సాహిత్య ప్రస్థానం' వార్షిక సంచిక వస్తూ ఎందరో సాహిత్యాభిమానులను అలరిస్తుంది. ఈ సంవత్సరం దిక్సూచి పేరుతో ప్రసిద్ధుల ప్రత్యేక సంచికగా విడుదలయింది. రెండేళ్ళ విరామం తరువాత వచ్చిన ఈ సంచికలో తెలుగు కవులు, రచయితల గురించే కాక, జాతీయ, అంతర్జాతీయ కవులు, రచయితలకు సంబంధించిన




రచనలతో విస్మృత భావజాలంతో ప్రచురితమయ్యాయి. సంపాదకులు "ఇప్పుడు తెలుగునాట మనం చూస్తున్న రాజకీయ సామాజిక సాంస్కృతిక అనిశ్చితిలో మార్గదర్శకం చేయగల మహా రచయితలను, కవులనూ తేరిపార చూడటం అవసరమనిపించిన ఫలితమే ఈ ప్రత్యేక సంకలనం... అదే దీని ప్రత్యేకత" అన్నారు. దీని ఖరీదుతో పోల్చితే విషయం ఎక్కువనే చెప్పాలి.

---

## ఆంధ్రజ్యోతి

# ఏరిన సాహితీ ముత్యాలు

'సాహిత్య ప్రస్థానం' మాసపత్రిక (ప్రత్యేక సంచికగా రెండేళ్ళ విరామం తర్వాత) దాదాపు 35 మంది లబ్ధప్రతిష్టుల రచనలతో మనముందుకు వచ్చింది. పేరుకు తగ్గట్టు ఇది నిజంగా దిక్సూచే. గురజాడ, కాళోజి, విశ్వనాథ, వల్లంపాటి, సుబ్రహ్మణ్య భారతి, రవీంద్రనాథ్ టాగూర్‌లాంటి ప్రాంతీయ, జాతీయ సాహిత్యకారులతో పాటు ప్రపంచమెరిగిన గోర్కీ, టాల్‌స్టాయ్, పికాసోల వరకూ ఉన్నారు ఇందులో. ఏదో ఒక సందర్భంలో వాళ్ళు వెలిబుచ్చిన అభిప్రాయాలు, ఆత్మకథలు, లేఖలు, ఇంటర్వ్యూలు, స్వీయ పీఠికలు, సంభాషణల నుండి కొంత భాగాన్ని రుచి చూపించే ప్రయత్నం చేశారు. ముఖ్యంగా 70 ఏళ్ళ క్రితం కనుపర్తి వరలక్ష్మమ్మగారి 'కథ ఎట్లా ఉండాలె?' కథ కోసమైనా ఈ పుస్తకం కొనాలి. రచయితల అతిశయాలు, పరస్పర రాగద్వేషాలు ఆ కాలంలో ఎలా ఉండేవో చెప్పినా అవన్నీ ఈనాటికీ వర్తించడం గమనార్హం. సాహిత్యాన్ని ప్రేమించే వారంతా తప్పక చదవాల్సిన సంచిక.

---

## నమస్తే తెలంగాణా

### 'దిక్సూచి' ప్రసిద్ధుల ప్రత్యేక సంచిక

దాదాపు యాభై మంది మహా రచయితల కలాల నుంచి వెలువడిన వివిధ రకాల రచనలతో వెలువడిన సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక ఇది. ఆ మహా రచయితల ఆత్మకథలు, అనుభవాలు, అభిప్రాయాలు, సలహాలు, సంభాషణలు, సంవాదాలు, లేఖలు, ఇంటర్వ్యూలు, స్వీయ పీఠికలున్నాయి. సాహితీ ప్రియులంతా... తప్పక చదివి దగ్గరుంచుకోదగిన విశేష సంచిక ఇది.

---

## సాక్షి

### ఈ దృష్టి నేటి అవసరం

కాలానికి, రచనకీ ఉన్న సంబంధం, వస్తు రూపాలలో వస్తున్న మార్పునీ, అధ్యయనం చేయడమే రచయిత ప్రధాన వ్యాపకం కానక్కరలేదు. ఎందుకంటే అవి పట్టించుకుంటేనే రచయిత / కవి కావడానికి అర్హత వస్తుందన్న వాదన అర్థరహితం. కానీ సాహిత్య నిర్మాణంలో దాని దశ, దిశలను గమనించేటప్పుడు వాటి ఆవశ్యకత మాత్రం తిరస్కరించలేనిదే. సాహితీ ప్రస్థానాన్ని నిర్దేశించవలసిన సమయంలో వాటి చర్చ అనివార్యం కూడా. ఈ పని గతంలో విమర్శకులతో పాటు, రచయితలు కూడా చేసేవారు. అంతే పరిణామాలనీ, వాటి మీద కాలం ప్రభావాన్ని గమనించడం దగ్గర ఉండవలసిన దృష్టిని ఆ చర్చ ఏర్పరుస్తుంది. సాహిత్య ప్రక్రియల స్వరూప స్వభావాలను కూడా అప్పుడప్పుడు పునశ్చరణ చేసుకోవలసిన అవసరం కూడా తెలుస్తుంది. గత కొద్దికాలంగా తెలుగు సాహిత్యానికి సంబంధించినంత వరకు ఈ ప్రక్రియ అత్యంత బలహీనమై పోయిందంటే సత్యదూరం కాదు. తెలుగు విమర్శ నానాటికీ కుంచించుకుపోవడమే ఇందుకు కారణమేమో కూడా. 'సాహిత్య ప్రస్థానం' జూన్, జూలై ప్రత్యేక సంచిక ఈ సంగతినే గుర్తు చేస్తుంది. దీనిని 'దిక్సూచి' ప్రసిద్ధుల ప్రత్యేక సంచిక'గా వెలువరించి నందుకు అభినందించవలసిందే. గురజాడ, వేటూరి ప్రభాకర శాస్త్రి, శ్రీపాద, గరిమెళ్ళ, దువ్వూరి రామిరెడ్డి, కనుపర్తి వరలక్ష్మి, సురవరం, దేవులపల్లి, చలం, మల్లాది రామకృష్ణశాస్త్రి, జాషువా, మగ్దూం, సుంకర, కాళోజీ, శ్రీశ్రీ - విశ్వం, బుచ్చిబాబు, రావిశాస్త్రి, టాగూర్, ప్రేమ్‌చంద్, భగత్‌సింగ్, టాల్‌స్టాయ్, గోర్కీ, లూసన్ పికాసో వంటి వారి అభిప్రాయాలు వ్యాసాల రూపంలో, ఇంటర్వ్యూల రూపంలో ఇందులో కనిపించి మెదడుకు మేతనిస్తాయి.

ఇందులో విశ్వనాథ సత్యనారాయణ వ్యాసం ఉంది. ఈ వ్యాసమే ప్రత్యేకంగా వేయడం, ప్రగతి వ్యతిరేకవాద సాహిత్యానికి ఒక ఉదాహరణగా పేర్కొనడం హాస్యాస్పదం. విశ్వనాథ మీద ఉన్న ఈ ముద్రను సరైన రీతిలో ఆవిష్కరించదలచినా కూడా ఈ ఉదాహరణ అత్యంత పిల్లచేష్టలా కనిపిస్తుంది. ముందుమాటలో పేర్కొన్నట్లు దెయ్యాల గురించి ఆయన ఆ వ్యాసంలో "బల్లగుద్దిన" దాఖలాలు కూడా కానరావు. భాష, భావం, దృక్పథం, దేశ సాహితి, శాబ్దిక శక్తి, కథ, నవల, కవిత పరిధులు వంటి విషయాలు ఇంతటి పెద్దలు చెప్పగా చదవడం అదృష్టం. ఈ అదృష్టాన్ని మనకు కల్పించిన సంపాదక మండలికి అభినందనలు చెప్పాలి.



ఆగష్టు 29న తెలంగాణ భవన్‌లో మంజీరా రచయితల సంఘం ఆధ్వర్యంలో వేముల పెరుమాళ్ళు రచించిన 'తెలంగాణ జాతీయాలు' పునర్ముద్రిత పుస్తకాన్ని ఆవిష్కరించిన తెలంగాణ జాగృతి అధ్యక్షురాలు కల్వకుంట్ల కవిత. వేదికపై సర్వోదయ అధ్యక్షుడు అర్జున్‌గౌడ్, మాజీ ఎమ్మెల్సీ పి. సుధాకర్‌రెడ్డి, మాజీమంత్రి రాజేశం గౌడ్, రిటైర్డ్ జాయింట్ రిజిస్ట్రార్ వేముల ప్రభాకర్, నమస్తే తెలంగాణ దినపత్రిక ఎడిటర్ అల్లం నారాయణ, దేశపతి శ్రీనివాస్, డా॥ నందిని సిధారెడ్డి, మాజీ మంత్రి పడాల భూమన్న, నేటి నిజం దినపత్రిక ఎడిటర్ బైస దేవదాస్



ఆగష్టు 6న కలకత్తా నగరంలో గ్రీవార్ తెలుగు గ్రంథాలయావరణ ముందు జరిగిన డా॥ రాధశ్రీ వీడ్కోలు, సన్మాన సభ చిత్రంలో (ఎడమ నుండి కూర్చున్నవారు) జి. లక్ష్మీనారాయణ, వై. అప్పారావు, రాధాశ్రీ, బి. రామారావు, ఎ. లక్ష్మీనారాయణ. (ఎడమ నుండి నిల్చున్నవారు) ఎ. ధనుంజయరావు, యర్ర అప్పారావు, జె. ముకుందరావు, సప్పటి దాలయ్య, సున్నపు కురేషు తూతిక సురేష్‌కుమార్

# జనం గుండెల్లో గురజాడకు ప్రత్యేక స్థానం

## జెవివి ఆధ్వర్యంలో 150వ జయంతి సభ :

### చిత్తూరులో

జనం గుండెల్లో గురజాడ అప్పారావుకు ప్రత్యేక స్థానం వుందని వ్యక్తలు ఉద్ఘాటించారు. జనవిజ్ఞాన వేదిక ఆధ్వర్యంలో స్థానిక విజయం డిగ్రీ కళాశాలలో 150వ జయంతిని నిర్వహించారు. ఈ సందర్భంగా జిల్లా అధ్యక్షులు రంగనాథం మాట్లాడుతూ తెలుగుభాషలో అనేకమంది కవులు, కళాకారులు ఉన్నా గురజాడకు జనం గుండెల్లో ఓ ప్రత్యేక స్థానం ఎప్పటికీ ఉంటుందన్నారు. కొందరు కవులు అప్పటి రాజులను, రాణులను పొగిడేందుకే పరిమితమైతే మరికొందరు కవులు శృంగార కవులుగా చరిత్రలో మిగిలారన్నారు. కొంతమంది మాత్రమే సమాజం మార్పు కోసం రుగ్మతలను తరిమికొట్టేలా ప్రజల్లో చైతన్యం




గురజాడ అప్పారావు 150వ జయంతి సభలో ప్రసంగిస్తున్న జెవివి జిల్లా అధ్యక్షులు రంగనాథం

తీసుకొచ్చేందుకు ,తమ కలాన్ని ఝళిపించారని, అలాంటి కవులను నేటితరం కూడా గుర్తుంచుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉందన్నారు. గురజాడ రచించిన 'దేశమంటే మట్టికాదోయ్.. దేశమంటే మనుషులోయ్' అన్న పాటతో దేశంలోని జనాన్ని గుర్తు చేసేలా పాడారన్నారు. సమాజంలోని కన్యాశుల్కం, కులపీడన, దోపిడీ లాంటి వాటిపై తన కవితలతో జనాన్ని మేల్కొల్పిన గురజాడ సాహిత్యం నేటి విద్యార్థులకూ బోధించేలా పాఠ్యపుస్తకాల్లో చేర్చాలన్నారు. జెవివి సీనియర్ నేత, జిల్లా గౌరవ అధ్యక్షుడు ఎజి. యతిరాజులు మాట్లాడుతూ నాడున్న సమాజంలోని చీడపీడలపై యుద్ధాన్ని ప్రకటించిన మహాకవి గురజాడ అప్పారావు అని అన్నారు. ఆయన రచించిన అనేక కవితలు ప్రజాదరణ పొందాయన్నారు. ఆనాటి సమాజంలో ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలపై ఎంతో ప్రభావాన్ని చూపించాయని, 150 సంవత్సరాల తరువాత కూడా ఆయన్ను స్మరించుకుంటున్నామంటే అప్పారావు కవితల్లోని గొప్పతనం ఇట్టే అర్థమవుతుందన్నారు. ఈ సమావేశంలో భాషా పండిట్ జిల్లా అధ్యక్షులు ప్రసాద్ నాయుడు, విజయం డిగ్రీ కళాశాల తెలుగు లెక్చరర్ ధర్మమూర్తి, జెవివి సమత కన్వీనర్ శ్యామలాదేవి, జెవివి నేత మురళి, కళాశాల విద్యార్థినీ విద్యార్థులు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు.

### పలమనేరులో

మకుటం లేని మహారాజు ఆధునిక కవి గురజాడ అప్పారావు అని జన విజ్ఞాన వేదిక అధ్యక్షులు యుగంధర్ బాబు అన్నారు. బుధవారం స్థానిక ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో 150వ జయంతిని పురస్కరించుకుని సమావేశం జరిగింది. ముఖ్య అతిథిగా కళాశాల ప్రిన్సిపాల్ రాజేంద్రర్‌రెడ్డి విచ్చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ 'దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్" అని తెలుగు సాహిత్యానికి వన్నె తెచ్చారని అన్నారు. కన్యాశుల్కం నాటక గ్రంథకర్తగా కొనియాడారు. సమాజంలో చెడు సంప్రదాయాలను నిర్మూలించడానికి ఆయన జీవితాన్ని అంకితం చేశారన్నారు. ఆయన గొప్ప సంస్కర్తగా ఉన్నారన్నారు. విజయనగరంలో 1862వ సంవత్సరంలో జన్మించారని తెలిపారు. కుమార్ స్వామిరెడ్డి మాట్లాడుతూ ఆయన రచించిన తెలుగు సాహిత్యాన్ని నేటి యువతరం ఆదర్శంగా తీసుకోవాలన్నారు. ఆధునిక కవి గురజాడ అప్పారావేనని ఆయన రాసిన దేశభక్తి గీతం అందుకు చక్కటి ఉదాహరణన్నారు. ఆయన స్ఫూర్తిని మార్గదర్శకంగా తీసుకోవాలన్నారు. ప్రజల కోసం, స్వావలంభన కోసం ఆయన స్మృతులు సువర్ణ అంకములుగా నిలిచాయన్నారు. ఈ కార్యక్రమంలో జెవివి నాయకులు గిరధరమూర్తి, గురుస్వామి నాయుడు, లెక్చరర్లు, విద్యార్థిని విద్యార్థులు పాల్గొన్నారు.

### కర్నూలులో

సాహితీ స్రవంతి రాష్ట్ర కమిటీ ఇచ్చిన పిలుపుమేరకు స్థానిక నేషనల్ తెలుగు పండిట్ కళాశాలలో సెప్టెంబర్ 21న గురజాడ 150వ జయంతి సభ జరిగింది. ముఖ్య అతిథిగా వచ్చిన డా॥ పాణ్యం శ్రీనివాస్ మాట్లాడుతూ సాహిత్య స్పృహ వున్న కవి గురజాడ అన్నారు. సాహిత్యంలో గల దోషాలు తెలిసినవాడు కనుకనే తెలుగులో నవ్య రీతులను, ప్రమాణాలను ప్రవేశపెట్టగలిగిన కవిగా చరిత్రలో నిలిచి పోయారు. రాజకీయ స్వాతంత్ర్యమే కాదు సాంస్కృతిక స్వాతంత్ర్యం, సమిష్టి భావజాలం అవసరం తెలుసుకొని అటువంటి సాహిత్యాన్నే రాశారని కొనియాడారు. మాత్రాచందస్సు ప్రయోగం ద్వారా ఆధునిక తెలుగు సాహిత్యాన్ని సులభతరం చేసిన మహాకవి అన్నారు. సభకు అధ్యక్షత వహించిన సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు మాట్లాడుతూ కన్యాశుల్కం హాస్యంతో పాటు సామాజిక స్పృహ కలిగి వ్యావహారిక భాషలో సాగిన గొప్ప రచనగా కొనియాడారు. ఇంకా కళాశాల అధ్యాపకులు శ్రీయుతులు విశ్వమోహన్; శ్రీమతి సుజాత పాల్గొన్నారు. కళాశాల ప్రిన్సిపాల్ నిస్సార్ అహ్మద్ వందన సమర్పణ చేశారు.



సభలో ప్రసంగిస్తున్న డా॥ పాణ్యం శ్రీనివాస్




**హిందీ భాషా దినోత్సవం సెప్టెంబర్ 14న సచివాలయంలో జరిగిన సభలో యువలేఖక్ పురస్కారం స్వీకరిస్తున్న పేరిశెట్టి శ్రీనివాస్**

# పేరిశెట్టి శ్రీనివాస్‌కు హిందీ యువలేఖక్ పురస్కారం

2011 సంవత్సరానికి గాను ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ హిందీ యువలేఖక్ పురస్కారం తెలుగు భాషకు గాను పేరిశెట్టి శ్రీనివాస్ అందుకున్నారు. హిందీ దినోత్సవం రోజైన ఈ నెల 14న సచివాలయంలో జరిగిన ఒక కార్యక్రమంలో ఆంధ్రప్రదేశ్ ఉప ముఖ్యమంత్రి దామోదర రాజనరసింహ ఈ పురస్కారాన్ని అందజేశారు. ఈ కార్యక్రమంలో యార్లగడ్డ లక్ష్మీప్రసాద్; ఉన్నత విద్యాశాఖ ముఖ్యకార్యదర్శి గోపాల్, హిందీ అకాడమీ డైరెక్టర్ శర్మ తదితరులు పాల్గొన్నారు. పేరిశెట్టి శ్రీనివాస్ దక్షిణ భారత హిందీ ప్రచార సభలో అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేస్తున్నారు. తెలుగు ప్రాంతంలో హిందీ భాషా వ్యాప్తికి వీరు చేస్తున్న కృషికి ఈ పురస్కారం దక్కింది. హిందీలోని పలు రచనలను, కవితలను తెలుగులో అనువదించారు.

# విహారి, కాట్రగడ్డ దయానంద్‌లకు సాహిత్య పురస్కారం

గుంటూరు జిల్లా రచయితల సంఘం 2010 సంవత్సరం సాహిత్య పురస్కారాలకు విహారి, కాట్రగడ్డ దయానందలను ఎంపికచేసినట్లు ఆ సంఘం అధ్యక్షులు సోమేపల్లి వెంకటసుబ్బయ్య, కార్యదర్శి కోసూరి రవికుమార్ ఒక ప్రకటనలో తెలిపారు. విహారి 'ప్రాప్తం' కథల సంపుటి , కాట్రగడ్డ దయానంద్ 'గుండ్లకమ్మ తీరాన' కథల సంపుటికి ఈ పురస్కారం ప్రకటించారు. న్యాయనిర్ణేతలుగా రసరాజు, యర్రమిల్లి విజయలక్ష్మి వ్యవహరించారని తెలిపారు. గుంటూరులో జరిగే కార్యక్రమంలో ఈ పురస్కారాలు అందిస్తున్నట్లు తెలిపారు.




**సెప్టెంబర్ 15న శరత్‌చంద్ర ఛటోపాధ్యాయ జయంతి సందర్భంగా శరత్ సాహితీ కళా స్రవంతి, కరీంనగర్ ఆధ్వర్యంలో ప్రసంగిస్తున్న సందేపల్లి నాగేంద్రశర్మ వేదికపై ఏల భద్రారావు, అన్నవరం తదితరులు**

# శతాధిక కవిసమ్మేళనం

నెల్లూరు జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో నవంబర్ 6న(ఆదివారం) నెల్లూరు పట్టణంలో ఇండియన్ మెడికల్ అసోసియేషన్ హాలులో ఉదయం నుండి సాయంత్రం వరకూ శతాధిక కవిసమ్మేళనం నిర్వహిస్తున్నట్లు ఆ సంఘం కార్యదర్శి శ్రీమతి పాతూరి అన్నపూర్ణ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ కార్యక్రమంలో పాల్గొనదలచిన కవులు తమ పేర్లను ముందుగా నమోదు చేసుకోవలిసందిగా కోరారు. శతాధిక కవిసమ్మేళనంలో పాల్గొని కవితలు చదివిన వారిలో ఉత్తమ కవికి నగదు పురాస్కారాన్ని అందజేస్తామని తెలిపారు. ఆగస్టు నెలలో నిర్వహించిన కవితల పోటీ విజేతలకు ఈ కార్యక్రమంలోనే బహుమతులను అందజేయనున్నట్లు ఆ ప్రకటనలో తెలిపారు. కవులు తమ వివరాలను 'పాతూరి అన్నపూర్ణ, ప్రధాన కార్యదర్శి, 1156/ 28-1, ప్రశాంతినగర్, నవలోక్ గార్డెన్స్, నెల్లూరు - 524002' చిరునామాకు పంపవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9490230939, 9010771622 ద్వారా సంప్రదించవచ్చును.




**విజయనగరంలో ఆగస్టు 29న సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో నిర్వహించిన గిడుగు రామూర్తి జయంతి సభ చిత్రంలో వెంకటేశ్వరరావు, అల్లంశెట్టి చంద్రశేఖర్, కృష్ణారావు**

# తమిళనాడు ఆర్టీసీ బస్సులపై తెలుగులో పూర్తి పేర్లు

ఆంధ్ర రాష్ట్రానికి వస్తున్న తమిళనాడు ఆర్టీసీ బస్సులపై తెలుగు పేర్లు రాయించేందుకు తమిళనాడు రవాణా శాఖ అంగీకరించింది. తెలుగు భాషోద్యమ సమితి వ్యవస్థాపక అధ్యక్షుడు సాకం నాగరాజుకు తమిళనాడు రవాణా శాఖ నుంచి ఈ మేరకు అంగీకార పత్రం అందింది. తిరుపతిలోని తెలుగు భాషోద్యమకారులు ఈ విషయమై కొన్ని నెలలుగా జరిపిన ఆందోళనల ఫలితంగా తమిళనాడు ప్రభుత్వం అధికారికంగా ప్రకటన విడుదల చేయడంపై సర్వత్రా ఆనందం వ్యక్తమవుతోంది. తెలుగు భాషాభిమానులకు, ఉద్యమకారులకు ఇది తొలి విజయమని తెలుగు భాషోద్యమ సమితి అధ్యక్షులు శ్రీమన్నారాయణ పేరూరు బాలసుబ్రహ్మణ్యం, బి. దామోదరరెడ్డి, జల్లె తులసీ యాదవ్ తదితరులు వ్యాఖ్యానించారు. తెలుగు భాష ఉద్యమకారులు జి.వి.ఆర్. నాయుడు మాట్లాడుతూ తమిళనాట తెలుగువారు నివసించే ప్రాంతాలలో తెలుగుభాష అమలు చేయాలని విజ్ఞప్తి చేశారు. పొరుగు భాషలను గౌరవిస్తూ తమిళనాడు సరిహద్దు ప్రాంతాలలో తమిళ మాధ్యమాలను తెలుగు ప్రాంతాలలో అమలు చేస్తున్నామని గుర్తుచేశారు. ఈ విషయాన్ని స్ఫూర్తిగా తీసుకుని తిరుపతి వ్యాపార వర్గాలు తమ షాపులపై పేర్లను తెలుగులో రాయించాలని జిల్లా అభ్యుదయ రచయితల సంఘం అధ్యక్షుడు కోట పురుషోత్తం కోరారు. టిటిడిలోని వివిధ విభాగాల్లో తెలుగు భాష అమలును వేగవంతం చేయాలని విజ్ఞప్తి చేశారు.



డా॥ పట్టాభి కళాపీఠం, మచిలీపట్నం వారిచే రాష్ట్ర స్థాయిలో ఉత్తమ కథా రచయితగా 'తూములూరి రాజేంద్రప్రసాద్' ప్రతిభా పురస్కారాన్ని అందుకుంటున్న రచయిత, అనువాదకుడు రంగనాథ రామచంద్రరావు. చిత్రంలో తుర్లపాటి కుటుంబరావు, కృష్ణా యూనివర్సిటి వైస్ ఛాన్సలర్, కృష్ణా జిల్లా రచయితల సంఘం అధ్యక్షులు గుత్తికొండ సుబ్బారావు, తూములూరి రాజేంద్ర ప్రసాద్



నాటక, కథా రచయిత వల్లూరు శివప్రసాద్ రచించిన 'ముందే మేలుకో' వైద్య విజ్ఞాన కథల సంపుటిని ఆవిష్కరిస్తున్న డాక్టర్ ఆర్. రమేష్‌బాబు. వేదికపై జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ ఎం. గోపి నాయక్, అదనపు వైద్య ఆరోగ్య శాఖాధికారిణి డాక్టర్ పి. ఉమాదేవి, వల్లూరు శివప్రసాద్



ఆగస్టు 12న హైదరాబాద్ త్యాగరాయ గానసభలో కిరణ్ సాంస్కృతిక సమాఖ్య నిర్వహించిన 'స్నేహం'పై కవితా పోటీల బహుమతి ప్రదానోత్సవ సభలో బహుమతి పొందిన విజేతలలో దీక్షితులు, నేటినిజం సంపాదకులు బైస దేవదాస్, లంకా సుబ్రహ్మణ్యం, డా॥ సి. భవానీదేవి,సినీ దర్శకులు లక్ష్మణరేఖ గోపాలకృష్ణ



సెప్టెంబర్ 19న రవీంద్ర భారతి హైదరాబాద్‌లో జరిగిన జివిఆర్ ఆరాధ్య కల్చరల్ ఫౌండేషన్ నిర్వహించిన కార్యక్రమంలో ముఖ్య అతిథి పద్మవిభూషణ్ డా॥ అక్కినేని నాగేశ్వరరావు ద్వారా స్వర్ణ కంకణం స్వీకరిస్తున్న వి.ఎస్. రాజ్యలక్ష్మి (సాంస్కృతిక రంగం), సి. రామకృష్ణ, గుదిబండ వెంకటరెడ్డి, రవి కొండబోలు, పి. విజయబాబు, సిహెచ్. త్రినాధరావు

# ఉత్తమ కవిత్వానికి ఆదరణ అవసరం



ప్రముఖ కవి, విమర్శకులు డా॥ రాధేయ రచించిన కవిత్వం ఓ సామాజిక స్వప్నం' విమర్శనా గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న సాహితీవేత్త డా॥ ద్వా.నా. శాస్త్రి. చిత్రంలో రచయిత రాధేయ, ద్వా.నా. శాస్త్రి, టి. రాజారాం, డా॥ గేయానంద్ (ఎంఎల్సి), కె.వి. రామానాయుడు

ఉత్తమ కవిత్వానికి మరింత ఆదరణ అవసరం... కవితా పోటీలకు పాటుపడుతున్న రాధేయలాంటి వారు అభినందనీయులని ఎమ్మెల్సీ డాక్టర్ గేయానంద్ అభిప్రాయపడ్డారు. 'కవిత్వం ఓ సామాజిక స్వప్నం' ఆధునిక కవితా విమర్శ గ్రంథాన్ని ఆవిష్కరించారు. గేయానంద్, ప్రభుత్వ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ టి. రాజారామ్, ప్రముఖ సాహితీవేత్త ద్వా.నా. శాస్త్రి, విమర్శకులు కె.వి. రామానాయుడు ప్రసంగించారు. స్పందన అనంత కవుల వేదిక ఆధ్వర్యంలో అనంతపురంలో జరిగిన సాహితీ కార్యక్రమంలో వక్తలు మాట్లాడుతూ ఉత్తమ సాహితీ గ్రంథాలు అనేకం రాధేయ కలం నుంచి జాలువారాయని, కవిత్వం ఓ సామాజిక స్వప్నంగా చూపిన రాధేయ రచనలు మార్గదర్శకాలన్నారు. సాహితీ సంస్థను ఏర్పాటు చేసి, ఎందరో కవులకు ఉమ్మడిశెట్టి పురస్కారాలు అందజేస్తున్న రాధేయ అనంతకు సాహితీ వారధిలాంటి వారని పేర్కొన్నారు. కార్యక్రమంలో కథా రచయితలు సింగమనేని నారాయణ, రవీంద్ర, కవులు మధురశ్రీ, మల్లెల నరసింహమూర్తి, చిలుకూరి దేవపుత్ర, అమళ్ళదిన్నె వెంకట రమణ, ప్రసాద్, పెద్దన్న పాల్గొన్నారు.

# 'జుమ్మా' ఆవిష్కరణ




'జుమ్మా' కథల సంపుటి ఆవిష్కరణ సభ – చిత్రంలో యండి.యాకుబ్ భాషా, దాదాహయత్, వేంపల్లి షరీఫ్, ఎమ్.వి. రమణారెడ్డి, సింగమనేని నారాయణ, మహమ్మద్ ఖదీర్‌బాబు

మైనార్టీ రచయిత వేంపల్లి షరీఫ్ కథా సంపుటి 'జుమ్మా' పేద ముస్లింల జీవిత గాథల ఆధారంగా వచ్చిందేనని తెలుగు కథా సాహిత్యంలో నిలబడే శక్తి ఉన్న పుస్తకమని వక్తలు కొనియాడారు. సిపిబ్రౌన్ గ్రంథాలయంలో సెప్టెంబర్ 4న 'జుమ్మా' పుస్తకావిష్కరణ సభ జరిగింది. ప్రసిద్ధ సాహిత్య విమర్శకుడు సింగమనేని నారాయణ మాట్లాడుతూ పేద తరగతి ముస్లింల జీవితాలను కథలుగా చిత్రీకరించడమే కాక మంచి శిల్పంతో రాసిన వేంపల్లి షరీఫ్ మరిన్ని కథ సంపుటాలు వెలువరించాలని కోరారు. యూనిసెఫ్ అవార్డు గ్రహీత శశిశ్రీ తన అధ్యక్షోపన్యాసంలో వేంపల్లి షరీఫ్ జిల్లాకు చెందిన నిబద్ధ కథ రచయిత అని, తన పేదరికంలోంచే కథలు రాశారన్నారు. పాత్ర రచయితగా మారిన వైనం జుమ్మా కథల సంపుటి చెబుతుందన్నారు. కథా సంపుటిని ఆవిష్కరించిన ప్రముఖ కథా రచయిత డాక్టర్ ఎం.వి. రమణారెడ్డి మాట్లాడుతూ సెక్యులరిజం కాంక్షించే కథలు రాయడం అభినందనీయమన్నారు. కథా రచయిత దాదా హయత్ మాట్లాడుతూ నవాబు సాబుల గరీబు కథలు రాసిన వేంపల్లి షరీఫ్‌ని అభినందించారు. ఆత్మీయ అతిథి మహమ్మద్ ఖదీర్‌బాబు మాట్లాడుతూ వేంపల్లి షరీఫ్ కమిటెడ్ యంగ్ రైటర్ అని, షరీఫ్ కథలు పాఠకుల అభిమానాన్ని ఎంతగానో చూరగొన్నాయన్నారు. మరో సాహితీ వేత్త ఎండి యాకూబ్‌బాషా మాట్లాడుతూ వేంపల్లి షరీఫ్ కథలు పాఠకులను లోతుగా ఆలోచింపజేసే కథలని తెలిపారు. వేంపల్లి షరీఫ్ తన స్పందనను తెలుపుతూ తన జీవితమే కాకుండా తన చుట్టు ఉన్న తన సామాజిక వర్గం బాధలను దగ్గరగా పరిశీలించి కథలు రాశానన్నారు. జి. వెంకటకృష్ణ, రాజేంద్రప్రసాద్, డాక్టర్ వినోదిని, సుంకోజి, రమణ, విశ్వప్రసాద్, కట్టా నరసింహులు, రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి, మల్లికార్జున రెడ్డి, ఇంకా సుబ్రమణ్యం, తదితరులు పాల్గొన్నారు.

# THE JUBLEE HILLS CO-OPERATIVE HOUSE BUILDING SOCIETY LIMITED




## JUBILEE HILLS, HYDERABAD - 500 171

## MANAGING COMMITTEE MEMBERS

**FROM 15.10.2010 TO TILL DATE**

| S.NO. | Name and Address | Designation |
|---|---|---|
| 1. | **Sri T. Narendra Choudary**<br>Plot No.196-111, Road No.76, Jubilee Hills, Hyderabad-33 | President |
| 2. | **Sri P. Sarath Kumar**<br>A-19, Journalist Colony, Road No.70, Jubilee Hills, Hyderabad-500 033 | Vice-President |
| 3. | **Sri T. Devendar Reddy**<br>8-2-269/27-B, Sagar Society Road No.2,Banjara Hills, Hyd | Secretary |
| 4. | **Sri T. Hanumantha Rao**<br>Plot No.1299-K, Road No.66 Jubilee Hills, Hyderabad-33 | Addl-Secretary |
| 5. | **Smt. M, Sucharita Reddy**<br>Plot No.321-A13,Road No.25 Jubilee Hills, Hyderabad-33 | Treasurer |
| 6. | **Smt. V. Anjana Reddy**<br>Siddharth Nivas, Plot No. 326 Road No.25, Jubilee Hills, Hyd-33 | M.C.Member |
| 7. | **Sri R.Dasaratha Rama Reddy**<br>8-2-268/V/21, Road No.3, Vivekananda Enclave,<br>Banjara Hills, Hyderabad-34 | M.C.Member |
| 8. | **Sri Y. Nageswara Rao**<br>Plot No. 1052-A, Road No.52 Jubilee Hills, Hyderabad-33 | M.C.Member |
| 9. | **Sri S. Jaya Prakash**<br>8-2-293/82/NL/290, MLA & MPs Colony,<br>Road No.IO-C, Jubilee Hills,Hyderabad-33 | M.C.Member |
| 10. | **Sri. G. Ramakrishnam Raju**<br>Plot N0.542-A, Road No.26 Jubilee Hills, Hyderabad-33 | M.C.Member |
| 11. | **Sri T. Rama Krishna**<br>Plot N0.915-A, Road No.46 Jubilee Hills, Hyderabad-33 | M.C.Member |
| 12. | **Sri Lalit Kumar Gupta**<br>Plot N0.1217-A, Road No.36 Jubilee Hills, Hyderabad-33 | M.C.Member |
| 13. | **Sri V. Chakrapani**<br>Plot No.168, Road No.13-A Jubilee Hills, Hyderabad-33 | M.C.Member |
| 14. | **Dr. Venkatesh Veera Reddy**<br>Plot No. 401-111, Road No.81 Jubilee Hills, Hyderabad-33 | M.C.Member |
| 15. | **Sri K. Siva Rama Krishna**<br>407-B,'B' Block, Usha Enclave Navodaya Colony,Srinagar Colony, Hyd. | M.C.Member |

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

దేశమును ప్రేమించుమన్నా!
మంచి అన్నది పెంచుమన్నా!
వొట్టి మాటలు కట్టిపెట్టోయ్,
గట్టిమేల్ తలపెట్టవోయ్!

2

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్.
తిండి కలిగితె, కండకలదోయ్
కండకలవాడేను మనిషోయ్!

3

యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్.
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశిసరుకులు నింపవోయ్.

గురజాడ అప్పారావు

49

సెప్టెంబర్ 21 గురజాడ అప్పారావు 150వ జయంతి ఉత్సవాల ప్రారంభం ....

SAHITYAPRASATHANAM RNI No.APTEL/2004/18398 Postal Regd. No.H/SD/415/10-12

PRSVM02A130

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




వెల: రూ. 125/-




వెల: రూ. 50/-




వెల: రూ. 35/-




వెల: రూ. 60/-




వెల: రూ. 50/-




వెల: రూ. 60/-




వెల: రూ. 75/-




వెల: రూ. 60/-




వెల: రూ. 100/-




వెల: రూ. 90/-




వెల: రూ. 125/-




వెల: రూ. 100/-




వెల: రూ. 50/-




వెల: రూ. 30/-




వెల: రూ. 20/-




వెల: రూ. 80/-




వెల: రూ. 20/-




వెల: రూ. 100/-




వెల: రూ. 70/-




వెల: రూ. 40/-

**ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013 27608107, ఫ్యాక్స్: 04027635136**

**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad
Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A130 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |